ఓం

# నెల్లూరు - నాటక కళ



గ్రంథకర్త:

కొమాండూరు పార్థసారథి అయ్యంగార్

కౌశికాశ్రమం - రంగనాయకులపేట, నెల్లూరు.

19—4—1952



వెల:
ఒక రూపాయి.

## సమర్పణము

నాకన్న పెద్దవారును, విద్యావంతులును, నెల్లూరున
సుప్రసిద్ధ న్యాయవాదులును, నాటక కళా పోష
కులును, నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్
వారి "పండిన పెరటి కల్పకము"ను,

దాతయు నగు బ్రహ్మశ్రీ

**తూములూరు**
**శివరామయ్య పంతులు గారికి**

ఈ చిన్ని పొత్తమును సమర్పించు
కొనుచున్నాను.



# విజ్ఞప్తి.

భారత దేశ స్వాతంత్ర్య సంపాదనమున నెల్లూరు సేవ ఒక ప్రత్యేకవిశిష్టత కలిగి వెలుంగుననిసనాత్యమున ఋజావు చేయుచు "కాంగ్రెస్ ప్రచార పాటల"ను "కాంగ్రెస్ సేవ యను సింహాపురి సంక్షిప్త చరిత్ర"ను వ్రాసి ప్రచురించి యుంటిని అయ్యవి పునర్ముద్రణము నపేక్షించు నంతటి ఆదరణమును చూరగొనినందులకు ధన్యుడను.

1939 సంవత్సరమున నే "నెల్లూరు నాటక కళ"యని "సింహాపురి" పత్రిక యందు కొంత వ్రాసి ప్రకటించియుంటిని మరి అది ఏలనో వేళరాక పూర్తి కాక నిలచియుండినది. నా మిత్రుడు శ్రీ కాశీ చెంచుసుబ్రహ్మణ్యంగారు గొప్ప నటుడై ఆంధ్ర దేశ మంతటను సంచరించినవాడై నెల్లూరు జిల్లా నాటక సమాజముల చరిత్రను, నటుల ప్రతిమల సేకరించి చేర్చి ప్రచురించు నవసర మెంతేనియు కలదని నాతోడుపాటును కోరుచు ప్రస్తావించుచుండిరి. అది ఇంకెంత కాలమునకు సమకూడునో యని తోచి నేననుకొని యుండినది వారికి తెలిపి, వారిసమ్మతి గొని, యీావల నేను కొంత యంబుత్తూరున కొంత విరామము ననుభవించు వాడనై, అందు దీనిని పూర్తిగావించి తెచ్చి ప్రచురించిన వాడనైతిని— వారికి నే నెంతయు కృతజ్ఞుడను.

ఇందు సత్యేతరములు కాని విషయములను అవి కొంత కటువులుగ నుండినను, పొందుపరచుట ధర్మముగా తోచి వ్రాసి యున్నాను. ఇదియు జనాదరణమునకు పాత్రమగునని నమ్ముచున్నాను.

చాపల్యమే యగుగాక, భగవదనుగ్రహమున "నెల్లూరు కీర్తి ప్రశంస" అను నొక చిన్ని గ్రంథమును, అన్ని విషయము లందును ఆంధ్ర దేశమున కంతటికి నెల్లూరే తలమానికమై యొప్పారు చుండుటను గూర్చి వ్రాసి అందజేయ నున్నాను.

ఈ గ్రంథమున అచ్చు పొరపాట్లు సామాన్యము లే-వానిని గమనించి సరిదిద్దుకొని చదివికొనవలయునని విన్నవించుచున్నాను.

బుధజన విధేయుఁడు,

**కో. పార్థసారథి అయ్యంగార్.**





# నెల్లూరు - నాటక కథ

చాలాకాలమునాడు ధార్వాడా కంపెని అని చాంగ్లీ కంపెని అని దూరదేశస్థులు నాటకములాడువార్లై వచ్చి దేశములు తిరుగుటలో నెల్లూరికిని వచ్చియుండిరి. అటుపిమ్మట నెల్లూరువారు కొందరుచేరి ఏదియో యొక సభ బహుశః "లక్ష్మీ విలాస నాటక సభ" యను పేరుతో ప్రారంభించి తెలుగు నాటకములు తిప్పరాజు సుబ్బయ్య సత్రంవద్ద ఆ సత్రపు ఖాళీస్థళములో పందిలివేయించి ఉంచుకొని ఆడుచుండుట కలిగియుండెను. అందు గడ్డం శేషయ్య తదితరులు వీరందరు వేషములువేసి నటించుచుండుట జరుగుచుండెను. గడ్డం శేషయ్య వేషము నాకు కొంచెము స్మరణకు వచ్చుచున్నది. అప్పుడు చాలా చిన్నవాడనుగా మావారెవరో కూడా పిలుచుకొనిపోగా పోయి చూచియున్నాను. బహుశః న్యాపతి కృష్ణస్వామిరావు (ఇప్పుడున్నారు వయస్సు 85) కీ॥ శే॥ ఆ వాసుదేవరావు, మధ్వపతి సత్యసంధరావు వీరందరు దానికి చెందిన వార్లై యుండిరని తోచుచున్నది. నెల్లూరు సంతపేట ఏటి కట్టవద్ద రామానుజపురం అని యున్నది. అచ్చటి కాపుర

స్తులు, శీనయ్య, పురుషోత్తం అను అన్నదమ్ములు, నాటక సమాజమును నెలకొల్పి "గూడూరు కంపెని" అను పేరుతో జిల్లాలో సంచరించి నాటకముల నాడుట కలిగియుండెను. ఈ కంపెనీవారు కనిగిరి వచ్చి చాలా నాటకముల నొకప్పుడు ఆడగా నేను కనిగిరి వాడనై, చిన్నవాడనుగా ఆ నాటకములకు పోవుచు ఒకప్పుడు బాణాసుర వేషమునుచూచి ఆ అఱుపులకు అదురుకొని ఇంటికి పోవలెనని తొందరింపగా నాకు గానన్ను తీసుకొని వెళ్ళినవారును నాటకమునుండి లేచివచ్చి నన్ను విడిచిపోవలసిన వారైరి. ఆ కంపెనివారు రాజుకోర్టు ఇత్యాది రంగములు వచ్చినపుడు ముందే తెరలోపలనుండి ఏవో అఱుపులు అట్టహాసముతో అఱచుట, రంగమున కత్తులు త్రిప్పుచు యుద్ధములు చేయుట ఇవన్ని స్మరణకు వచ్చుచున్నవి. వీరిలో శంకరయ్య అని ఒక బ్రాహ్మణుడుండెడివాడు. ఆయన అప్పుడు కనిగిరిలో పీర్లపండుగరాగా అందు పులివేషమువేసి ఆడుచు వకీళ్ళ ఇండ్ల వద్దకంతయు వచ్చినదికూడ జ్ఞాపకమున్నది. నలనాటకము వారు ఆడి, అందు నలమహారాజు పురమువిడిచి పోవువాడైనపుడు

రాగము తాళము

"ప్రియ బంధు జనులారా!-పోయివచ్చెదను
దయయుంచు డందరు-దైవాజ్ఞ ఇటులాయె ॥ప్రి॥
అధికారమును, దర్ప-మడవిపాలాయె
పృథివిని భోగములు-పుష్కరుని పాలాయె

అధిక దుష్కృ-తమేను చేసితి
అనుభవింపక- తీరదిప్పుడు"

అని యొక పాటను పాడుట చాలా జాలికరముగా నుం డెడిది జ్ఞప్తికి వచ్చుచున్నది. వీరు ప్రదర్శించిన "ప్రహ్లాద" నాటకమున అప్పుడచ్చట ఆస్పత్రి డాక్టరుగానుండిన న్యాపతి వాసుదేవరావుగారు (నెల్లూరువారే) హిరణ్యాకశ్యపు పాత్రను తాను నిర్వహింతుననిప్రవేశించి ధరించి ప్రహ్లాదుని బెత్తముతో కొట్టుచు కోపోద్దీపితుడై కత్తి విసరుటలో (అప్పటిలో కిరసనాయలు టోపీ లాందరులు వరుసగా మూడు కాబోలు రంగమున కట్టి వ్రేలాడదీయుటయే జరుగుచుండెడిది) ఆ లాంతరు తగిలి దైవాధీనమున అది క్రిందపడక గ్లాసు మాత్రము పగిలి రంగమున పడుట, ఇట్టివి స్మరణకు వచ్చుచున్నవి.

## నెల్లూరు అమెటుర్యార్ నాటకసభ

ఇంట్లుండ, పిమ్మట నెల్లూరులో విద్యావంతులు, ఎప్పుడైనను తీరుపాటు సమయములలో వినోదార్థము నాటకములు వేసి ఆనందింపవలెనని పూనిరి. అందు, కాలేజీలలో చదివినవారును చదువుచుండెడివారున్నునై, షేక్స్పియర్ నాటకములనుచదివి ఆనందించి కాలేజీ సభలలోనే నటించు పద్ధతిన, ఏయేమాటలు ఎట్లెట్లు రంగమున చెప్పవలయుటను నేర్చుకొని, ఇంగ్లీషు నాటకముల ప్రదర్శించుచు, తమకును చూడవచ్చినవారికిని తృప్తిగొలుపుచు నుండిరి.

ఈసభయొక్క ఆరవ వార్షికోత్సవమునకై వీరు ప్రకటించియుండిన యొక ఆహ్వానపత్రము శిథిలమైనది దొరకినది. దానినిపట్టి ఈ సభ అప్పటికి 6 సంవత్సరములకు ముందు అనగా 1891 సంవత్సరమున స్థాపింపబడినట్లు ఏర్పడును. ఆ వార్షికోత్సవమునుగురించి, (1897 సం॥ రం జూలై తే 3 దిన శ్రీ మహంకాళి సుబ్రహ్మణ్యం, బి.ఏ, యల్.టి, శ్రీకందాడై శఠగోప రామానుజం బి. ఏ. (వీరు శకుంతల పాత్రను ధరించి మిక్కిలి నిపుణతతో నటించిరని ప్రతీతి) వీరిరువురు కార్యదర్శులుగా ఒక ఆహ్వానమును ఇంగ్లీషులో ప్రకటించియున్నారు నెల్లూరులో అప్పటి కలెక్టరు ఇ. స్కాట్ Esq. C. S, గారు దయతో అధ్యక్షత వహింతురనియు అందు వ్రాయబడినది. వారి ఈయాహ్వానమున "రాత్రి 9 గంటలకు, శాకుంతల నాటకము ప్రదర్శింపబడు" ననియు, అయ్యది ఇప్పటిలో "బంగాళా దేశమందు వచ్చిన కరువుచే మ్రగ్గుచున్న జనమునకు సహాయార్థముగా" అనియు ప్రకటింపబడియున్నది. దీనినిబట్టి ఈ సభవారు మొదటినుండియు ప్రజోపయోగకరమైన కార్యములందు శ్రద్ధాళువులై, నాటక ప్రదర్శనములవలన గడించిన ద్రవ్యమును అట్టి సత్కార్యములకు వానికి వినియోగించుటయే దీక్షగాకలిగి సభను స్థాపించుకొనిరనియు. స్వలాభాపేక్షకులుగాగాని, తమలోతాము ద్రవ్యమును పంచుకొనుటకుగాగాని ఏర్పడినవారు కారనియు స్పష్టమగుచున్నది, ఇందు

సభ్యులుగా చేరవచ్చినవారిలో ఒకపాటి విద్యావంతులై జీవనోపాయము సాధించుకొని స్థిమితముగా నుండు వారిని మాత్రమే చేర్చికొనుచు, తదితరులగు వారిని "వలనుపడదు" అని ధైర్యముతో పంపివేయుచు నుండియుండిరి. ఇట్లు ఈ సభా స్థాపకులు సభకు ఒక గౌరవస్థానమును కల్పించి యుండినట్లు ముందు చెప్పబోవు విషయములంబట్టి విదితమగును. ఆ వార్షికోత్సవమున శాకుంతల నాటక ప్రదర్శనము జరిగినది. అందు విషయమై వారు ప్రచురించిన ప్రకటనము ఇంగ్లీషులోనున్నది. దానిని ఈ వరకు కొంతకాలమునాడు, నేను (ఆకాగితము పూర్తిగా చినిగిపోవకముందే) "సింహపురి" పత్రికయందు తే 30-1-39 ది ప్రకటించియుంటిని.

ఆ ప్రకటనమును ఇందు పొందుపరచు చున్నాను.

"THE AMATEUR DRAMATIC SOCIETY, NELLORE.

## "Kalidasa Sakuntala"

IN AID OF FAMINE RELIEF.

(3rd July 1897)

This Society needs no introduction to the public of Nellore. All the Six years and a half it has been in existence, it was confining its attention to the representations of Shakespear's Dramas mainly. A

new departure on this occasion is felt necessary. In obedience to the wishes of our sympathisers, we have now taken up "KALIDASA'S SAḰUNTALA" to be put on boards during the current session. Some years back we had the pleasure of acting a few Scenes from the same Drama, and the remarks of Mr. C. Ramachandra Iyer, C. S. on the occasion, that those Scenes were among the best that he till then witnessed presented, and the encouragement that was then given us by some of the leading gentry of the place, tempted us to believe that we might succeed better in the representation of our Indian Dramas. Ever since, we have been making some attempts to realize our dreams. The member who is to represent the part of the Hero, was for a considerable time, under the tution of Brahmasri V. Venkataraya Sastriar, Sanskrit Pandit, Telugu poet and Dramatist and has some time back, very successfully represented that part in the Madras Victoria Public Hall. With the sole view of taking time to make the best representation of the best play of the Greatest Indian Dramatist for the first time on the Nellore Stage, as successfull as possible,

we have been delaying this performance, and even now it comes off earlier than expected.

We have till now given no less than fifteen performances and yet we have made no other demand on the public of Nellore than a mere audience. The generosity of a few liberal-hearted gentry who have become our simpathisers, enabled us to appear on the stage on all those occasions. But the suffering of our fellow subjects in other parts of the country who are starving and are in sore need of help are, we submit, a sufficient justification for requesting the public to open their purse-strings on this occasion. The Collections by the sale of our tickets go to relieve the famine-stricken. The adoption of this new course doubtless places great responsibilities on us; and we are quite alive to it. We must however state that the matter of this performance, we are being kindly helped by the members of the Nellore Sarasa Manoranjani Sabha who have lent us all their paraphernalia and by the members of the Madras Suguna Vilasa Sabha who have placed the services of one in their employ at our disposal for scenic and other

arrangements. We have been able to command bumper-houses on all occasions when we issued complementary tickets. Though not the prospects of enjoyment on the occasion of the performance still the cause we have in view will, it is hoped, induce the public to give us the encouragement we deserve at their hands.

M. SUBRAHMANIAM, B. A., L. T.
K. SADAGOPARAMANUJAM, B. A.,
Joint Secretaries.
K. A. VEERARAGHAVACHARY.
30th June 1897 Business Manager."

(ఇది ఆనాడు నెల్లూరు రంగనాయకీ విలాస ముద్రాక్షరశాలయందు రంగనాయకుల పేటలో ముద్రింపబడియున్నది.)

పైన ప్రచురింపబడిన ఇంగ్లీషు పత్రమువలన ఈ శాకుంతల నాటక ప్రదర్శనమునకు ముందు (6½ సంవత్సరము షుమారు) ఈ సభవారు ఇంగ్లీషు నాటకములనే ప్రదర్శించు చుండినట్లును, తాము అప్పటికి షుమారు 15 నాటకములు ఆడి "దయచేసి వచ్చి చూచి మమ్ము ధన్యులు చేయుడు" అని అందరను ఆహ్వానించి ప్రదర్శించుటయే జరుపుచుండినట్లును ఈ శాకుంతలము "బంగాళాలో కరువుచే పీడితులగు జనమునకు ద్రవ్యసహాయ మొనర్చుటకై వేయుచుండుటవలన టిక్కెట్లు కొనవలసినదని" కోరినట్లును తెలియును. మరియు

అంతకుముం దొకమారు ఈశాకుంతలమున కొన్నిరంగములు వీరు ప్రదర్శింపగా శ్రీ సి. రామచంద్ర అయ్యర్, సి. ఎస్. గారు ఆ ప్రదర్శనమును చూచి, అప్పటికి తాము చూచి యుండిన అత్యుత్తమ ప్రదర్శనములలో నిదియొకటిగా తాము పరిగణించుచున్నామని చెప్పి ప్రోత్సహించి యుండినట్లును తెలియుచున్నది. అన్నిటికిని మించి అందు ఈ మాటలున్నవి. "సంస్కృతి పండితులును, ఆంధ్ర కవియు, నాటక రచనా ధురీణుడును అగు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారు గురువుగా, వారియొద్దశిష్యుడై చెప్పించికొని చదివి, మదరాసు విక్టోరియా పబ్లికు హాలులో బహు సమున్నతతో కాళిదాస శాకుంతలమున నాయకని వేషమును నిర్వహించినట్టి మా సభ్యుడు. ఆ నాయక పాత్రమును వహింపనున్నాడు." అనియు ప్రకటించిరి.

దీనిని బట్టి ఈ సభవారికి కీ॥ శే॥ వేదము వెంకటరాయ శాస్త్రుల వారి విషయమై ఎట్టి భక్తి గౌరవము లుండినదియు తెల్లమగుచున్నది. ఇందు వారి శిష్యుడుగా ప్రస్తావింపబడిన వారు, శ్రీమాన్ కే. శ్రీనివాసన్ గారని (దొరస్వామి అయ్యంగారువారు) గమనింపుడు. మదరాసు సుగుణ విలాససభ వారు ఈ సభవారికి మిత్రులుగను, సహోదభూతులుగను నుండినట్లును, "నెల్లూరు సుజన మనోరంజన సమాజము" అను నాటక సభ యొకటి యున్నట్లును తెలియును.

# కీ॥ శే॥ కందాడై కేశవాచార్యులవారు

ఆవల ఆంధ్రనాటక పితామహులగు శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులవారి "చిత్రనళీయ నాటకము" ప్రదర్శింపబడియున్నది. అందు ఈ దొరస్వామి అయ్యంగారువారి అన్నగారైన కందాడై కేశవాచార్యులు నళబాహుక పాత్రలను ధరించి నటించియుండిరి. ఈ కేశవాచార్యులు మహానిపుణులనియు, కొంతకాలమునకు పిమ్మట ఒకమారు పాదుకా పట్టాభిషేకమున దశరథపాత్రను వహించి నటనా కౌశలమున అసమానులను ఖ్యాతిని గడించినారినియు తెలియనయ్యెడు. (ఈ పాదుకా పట్టాభిషేక నాటక ప్రదర్శనమునకు ముందు ప్రాసముద్రీయ నాటకము ప్రదర్శింపబడియున్నది. అందును గురించి వెనుక వ్రాసెదను.) వీరు పిమ్మట చిరుత వయసుననే దేహముగ్నతవలన దివంగతులైనట్లు ఏర్పడుచున్నది. ఏలయనగా తే 6-1-1900 దిన ఒక ప్రకటన, "తే 1-1-1900 ది నాడు విషాద సారంగధర నాటకము ప్రదర్శింపబడు"నని సభా కార్యదర్శులుగా "టి. వి. ముద్దుకృష్ణ, బి. ఏ., కే. ఏ. వీరరాఘవాచార్యులు, బి. ఏ.," వీరిరువురి చేవ్రాలతో వేయబడినది. "టిక్కెట్లు వెలినోండి శ్రీనివాసరావు, (బిజినెస్ మేనేజరు) వద్ద" అని కూడ అందున నున్నది. ఆ ప్రదర్శనము:—

"In aid of the fund to commemorate in the V. R. H, School, Nellore the name of the late lamented Mr. K. Kesavachari"

అనియున్నది. ఇక విషాద సారంగధర నాటకమును గురించి ఈ మాటలున్నవి, "The development of the plot and the gracefulness of the composition are exceedingly charming" అని స్టేజ్ డైరెక్టరు నంగోలు వెంకటరంగయ్య అని చేవ్రాలున్నది, ఆ ప్రదర్శన సమయమున ఈ పద్యములు అచ్చొత్తించినవి పంచిపెట్టబడి నాటకరంగమున చదువబడియున్నవి.

"శ్రీ రామచంద్రాయనమః

సీ॥ ఎవ్వండు హితర క్తి ♦ మృదుసూక్తి హరిభక్తి,
వైష్ణవ వరవంశ ♦ పావనుండు।
ఎవ్వండు శుభవర్తి ♦ దృఢకీర్తి పరిపూర్తి,
నా విధు భాస్కర♦ జీవనుండు।
ఎవ్వండు కడుతేవ ♦ హితభావ రసహావ,
సూచనా కేళి ని ♦ స్తుల నిపుణుఁడు।
ఎవ్వండు పదపద్య ♦ కృతిగద్య నిరవద్య,
వచన ప్రగల్భతఁ ♦ ప్రథిత యశుఁడు।
గీ॥ అట్టి గౌతమ గోత్రజుం ♦ డార్యవినుత,
కార్యలోలుండు, కేశవా ♦ చార్యవరుఁడు।
నిరుడు మనుగూఁడి నడయాడి ♦ నెగడినాఁడు।
నేఁడువాఁడేడి? కటకటా! లేఁడు లేఁడు॥
సీ॥ ధరణి నెవ్వండు కం ♦ దాడ విఖ్యాత స,
ద్వంశపయోధి జై ♦ వాతృకుండు।

రహి నేఁడు వేంకట ♦ రంగార్య కనకమాం,
బా నేత్ర జీవ జీ ♦ వన విధుండు ।
ఎవ్వండు ప్రతిభా స ♦ మేధితమతి హూణ,
భాషాధ్యయనమునఁ ♦ బట్టభద్రుఁ ।
డెవ్వఁడు మా సమ ♦ జ్యేష్ఠాగ్రగణ్యుఁడై,
జన మనోమోదంబు ♦ సలిపెఁ నట్టి ।

గీ॥ కేశవాచార్యుఁ డా హృషీ ♦ కేశు సేవ ।
నాస్థ ధరఁబాసి యరిగెన ♦ వ్యయపదంబుఁ ।
గనఁగఁ గటకట! తనగురు ♦ జనుల హితులఁ,
జనునె పాయంగఁ దనయట్టి ♦ సజ్జనునకు॥

ఉ॥ భాసురమైన రూపములు ♦ వన్నెలు చిన్నెలతోడ వేషముల్ ;
భాసిలియున్ సభం గనమిఁ ♦ బ్రాణ విభుండగు కేశవార్యునిన్ ।
వాసిగ రూపు వన్నెయును ♦ వ్రాలియుఁ బత్ర వినిర్మితంబు నా ।
వాసనలేని పంకజము ♦ భాతిగ నైతి మిఁకేమి చెప్పఁగన్॥

కం॥ నలదశరథ భూమికలన్,
నలువుగ ధరియించి యధిక ♦ నైపుణ్యమునన్
జెలువార కీర్తిఁ దెచ్చిన,
యలఘు గుణాకరుని మఱువ ♦ నలవియె మాకున్॥

ఉ॥ ఆర్యసుతంబు చేసెను ని ♦ జాన్వయమున్ జనియించి, వేంకటా।
చార్య పురావనీంద్రసుపథ ♦ నాలయముం బ్రతియించి, యీసభన్।
గార్య విచక్షణ క్షమతఁ ♦ గైకొని, యట్టి గుణాఢ్యుఁ గేశవా।
చార్యుని విస్మృతిం గన వ ♦ శంబగునొక్కొ కృతజ్ఞకోటికిన్॥

నెల్లూరు,
11—1—1900

టి. వి. ముత్తుకృష్ణన్, బి. ఏ.,
కె. ఏ. వీరరాఘవాచార్యులు, బి. ఏ.,
కార్యదర్శులు.

“శ్రీ మత్సరస్వతీ నిలయ ముద్రాక్షరశాల రంగనాయకులపేట. నెల్లూరు.”

ఇట్లు గడించిన ద్రవ్యముతో "కేశవాచారి మెడల్" అని యొక రజత పతకమును ప్రతి సంవత్సరమును రాజాగారి హైస్కూలులో పరీక్షయందు ఉత్తీర్ణుడైన విద్యార్థికి ఒసగు ఏర్పాటుచేసి జరుపుచుండిరి. ఆ పతకమును పొందినవారు ఇప్పుడును కొందరుండి యుందురు.

## ప్రప్రథమ ప్రతాపరుద్రీయ ప్రదర్శనము

ఈ ప్రతాపరుద్రీయ నాటకమున వేంకటగిరి రాజాగారి స్కూలులో అప్పటిలో ఉపాధ్యాయులుగా నుండిన నేలటూరు కృష్ణమాచార్యులవారు అను ఆయన (వీరిని ఆత్మకూరు కృష్ణమాచార్యులని బంధువులలోను, పెద్ద కృష్ణమాచార్యులని స్కూలులోను అనెడివారు) ప్రతాపరుద్రుడుగను, తూము లూరు వేంకటరమణయ్యగారు (కావలిలో వకీలు) యుగంధరుడుగను ప్రఖ్యాతముగా నటించిరని పేరుగలదు.

1898 సం॥రం జనవరి నెల తే 24 ది సోమవారము రాత్రి 9 గంటలకు "లక్ష్మీవిలాస నాటకశాలలో" పై చెప్పిన ప్రతాపరుద్రీయనాటకము ప్రదర్శింపబడినట్లు ఒక శిథిలమైన పెద్ద అరతావు ప్రకటన అందు వెనుక ప్రక్క కథా వివరమును అచ్చై యుండినది దొరికినది. అందలి మాటలు కొన్ని చదుపరులకు కుతూహలము కలిగింపగలవని ఇందు పొందుపరచుచున్నాను. గమనింపుడు:—

"అమెట్యూర్ డ్రమాటిక్ సమాజము"

"మదరాసు క్రిష్టియను కాలేజి సంస్కృత ప్రధాన పండితులును, ఆంధ్రీకృత శాకుంతల నాగానందాది గ్రంథ కర్తయు, నాటకలక్షణవేదియని త్రిలింగ దేశమంతట ప్రఖ్యాతి వహించినట్టియు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిల వారిచే నూతనముగా రచింపబడిన "ప్రతాపరుద్రీయ నాటకము" "ఇట్టినాటకము ఇంతవరకు ఆంధ్ర భాషయందు లేనేలేదు. ఈనాటకమును నొకతటి జూచినతర్వాత ప్రతిమను జుడును గ్రంథమును తప్పక కొని చదువుననియు ఈనాటక ప్రదర్శన తరుణమును పలుమారపేక్షించుననియు దృఢముగ చెప్పగలము. పండిత పామరుల నందరను పూర్ణముగ సంతోషింప చేయగలదు.

"మేమిదివరకు ప్రదర్శించిన చిత్రనళీయము కేవలము శోకపూరితమగుటచే జనుల నీదుఃఖమునుండి తొలగించుటకై ఈ ప్రతాపరుద్రీయము నుండి చమత్కార భాగములు విశేషముగా గైకొనబడినవి. ఇందలిముఖ్యపాత్రములు గ్రంథ కర్తగారివద్ద శిక్షబొంది యుండుటవలన నవి యత్యద్భుత ముగా నుండు ననుటకు సందియముండదు.—"

"మొదటి తరగతియందు 30 కుర్చీలు మా పోషకులకై రిజర్వుచేయబడినవి. కుర్చీలన్నియు నెంబర్లు వేయబడి

యుండును. పుస్తకము ఆటరోజునను, ముందు రోజునను పందిలి వద్ద వెలకు దొరుకును.

కందాడై అనంతాచారి,
స్టేజిడైరెక్టరు.
20—1—98.

పై ప్రకటనను బట్టి అమెట్యూర్ నాటక సభవారు ప్రతాపరుద్రీయ నాటకమునకు ప్రప్రథమ ప్రదర్శకులని తెలియగలదు. శ్రీ వేంకటరాయ శాస్త్రులవారిని గురించి ఎంతయు పొగడి వారి నాటక లక్షణవేదిత్వమును కొనియాడి కొని యున్నారు. నాటక ప్రపంచమున ప్రతారుద్రీయమునకు గల ఉన్నతస్థానము నెంతయు గర్వముతో ప్రకటించికొనిరి.

ఈ ప్రతాపరుద్రీయ నాటక ప్రదర్శనము ఏలనో అంతకు ముందు ప్రదర్శింపబడిన శాకుంతలము, చిత్రనళీయము వీనివలె జయప్రదముగా నుండక పోవుటయు. సభాపోషకులును నెల్లూరు నందలి విద్యావంతులును మిక్కిలి అతృప్తి చెందుట యును కలిగి యుండినట్లు తెలియును.

యీ నాటక సభలో స్టేజ్ డైరెక్టరుగానుండి దీర్ఘకాల జీవియై మొనమొన్న దివంగతులైన శ్రీ ఒంగోలు వెంకట రంగయ్యగారు అప్పటిలో గుత్తిలో సబ్ రిజిష్ట్రారుగా నుండి "యీనాటకమును రంగమున ప్రదర్శింప నొల్లదు. చదివికొని ఆనందింపతగినదే" అనియు, "దీని ప్రదర్శన ప్రయత్నమును

మానుకొనుడు" అనియు ముందే సభాకార్యదర్శులకు వ్రాసి యుండిరట. నెల్లూరు వారైన శ్రీశాస్త్రిగారి యీనాటకమును ప్రదర్శింపకుండుటయా? అని కాబోలు పూని ప్రదర్శించిరి. తుదకు యీనాటకము సభారంజకము కాకపోయి అందరు చింతించి యోచించికొనసాగిరి. ఇంతలోననే గొప్పవిపత్తును సంభవించినది, గోరుచుట్టుపై రోకటిపోటయినది.

యీ ప్రతాపరుద్రీయ నాటక ప్రదర్శనమును గురించి అప్పటిలోనుండిన నెల్లూరు పత్రిక "వాగ్వల్లి"యందు వ్రాయ బడిన మాటలలో ఈ క్రిందివి మాత్రము గమనింపతగినవి.-

" ఇందు నాంది పద్యమగు నీటనుడాగి ఇత్యాది న, ఆ దిన ప్రయోగింపబడిన ఈ "న" వర్ణము నగన బీజాక్షరము. దీనిని పద్యాదిని నిలిపిన వంశనాశనమని ఛందశ్శాస్త్రంబు లందు గననయ్యెడు. మరి ఇంతియగాక "పురాస్త్రరసగిరి రుద్రేష్వ కచటతపామాత్రకానింద్యాః" అనుసూత్ర వాఖ్య యందు అప్పకవి "క॥ కూరడుగుము కాయలు మే" అని సోదాహరణముగ నిషేధించియున్నను, "పై నీటను డాగి" పద్యమున నారింట "క" కారంబుంచబడియున్నది. ఇట్టి విష యమున కీడు మూడు ననుటకేమి సందియము! ఇందునకు దృష్టాంతముగా నీ నాటకమును నెల్లూరున ప్రదర్శించిన "అమెట్యూరు నాటక సభ" వారియందు నాటకము జరిగిన స్వల్పకాలములోనే యుగంధర వేషమును, ప్రతాపరుద్ర వేష

మును వేసిన మా పుత్రరత్నములు, పిడుగుపడి చచ్చినట్లు హఠాత్తుగ మరణమందిరి. అందులో యుగంధర వేషమును వేసినవారు వకీలుగానుండి ఒక కేసులో వాదించుచు కోర్టులో కుర్చీపై కూర్చుండియుండి యకారణముగ బాణపాతమున గూలినట్లు ప్రాణమున్వదలిరి. రెండవ వారిదియు నిట్టి దారుణ మృతియె.

అప్పకవి యుదహరించిన పై కందము కడపట "అమ్మిన గ్రుమ్మినట్లు పడెను విప్ర"డని యీ "క" కారము 'విషాక్షరమై యుగంధర వేషధారి సామాన్య బాణముచేతను, ప్రతాపరుద్ర వేషధారి విషాక్త బాణముచేతను జంపబడినట్లు చచ్చిరి—" అని వ్రాయబడినది.

కనిగిరి కోర్టులో వకీలుగా 40 సంవత్సరములుండి ఈ వల దివంగతులైన అల్లాడి సూర్యరామయ్యర్ గారి సభ్యత్వపు దరఖాస్తు శిథిలమైనది దొరికినది. దానిబట్టి వారు ప్రతాపరుద్రీయనాటక దినముననే (25-1-98) ఆ దరఖాస్తు పంపుకొని సభ్యులై ఆరాత్రియే పాత్రధారణమును కూడ చేసినట్లు తెలియుచున్నది. పాత్రధారులేమో ప్రతియొక్కరును నిపుణులై ప్రశంసనీయముగ నిర్వహించిరని అందరూ అనుకొనిరి కాని ఏలనో నాటకము బాగుండలేదని మాత్రము ఏర్పడినది.

ఈ సభా పోషకులలో ముఖ్యులైన హెడ్మాస్టరు రామానుజరావునాయుడుగారు, జడ్జి స్వామినాథయ్యర్ గారును

చిత్రనళీయమున ఎంతో ప్రఖ్యాతమైన పేరువచ్చినదే మనకు ఇది యేల” అని ఆశ్చర్యపడుకొని అనిరి. ఇదేనాటకమునుండి విడిగా కొన్ని భాగములు చిత్రనళీయ నాటకమున మధ్య మధ్య ప్రదర్శింపబడి యుండి నప్పుడు అవి హాస్యప్రధానము లగుట కాబోలు బాగానుండిన వనిరి. అప్రస్తుతము కాదేని ఇచ్చట మరొకమాట చెప్పదగియున్నది, ప్రఖ్యాత నటులు బళ్ళారి టి. రాఘవాచార్యులవారు చారిత్రనాటకముల దు ఎక్కువ అభిమానముకలవారు. ఈనాటకమునుఆదరించి యుగంధరపాత్రను ధరించి అత్యద్భుతముగా నటించినవారు నెల్లూరు నకును వచ్చి వారు తమ నైపుణ్యమును ఇందు విషయమై ప్రదర్శించి యున్నారు. వారు పిచ్చివాని భాగము ప్రదర్శనార్హము కాదనియు, అందుననే నాటకముయొక్క గాంభీర్యత లోటువడుననియు చెప్పుచు ఆపిచ్చివాని భాగమును మాత్రము తాను నటించుటలేదని మరి ఎవరికేనియు వదలిపెట్టెడివారు ఇది ఎల్లరకు తెలిసిన విషయమే.

## కందాడై అనంతాచార్యులవారు

వీరు ప్రొగ్రెసివ్ యూనియన్ ప్రప్రథమ సభ్యులుగ నుండి చనిపోయినారు. వీరు ప్రతాపరుద్రీయ నాటక ప్రదర్శన మప్పుడు స్టేజి డైరెక్టరుగా నుండినవారు. వీరు అమెట్యూర్ నాటక సభకు చేసిన సేవ అపారము—చిరస్మరణీయము.

వీరు కలెక్టరు ఆఫీసుకు చెంది కందుకూరు డిప్టికలెక్ట రాఫీసు హెడ్‌గుమాస్తాగానుండి ఆవల వెంకటగిరిరాజాగారి ఏజంటుగా కందుకూరులో చాలాకాలము పనిచేసి దివంగతు లైనారు. వీరు జబ్బుతో నెల్లూరు చేరినారని వినగానే అప్పుడు మదరాసులోనుండిన కె. ఎ. వీరరాఘవాచార్యులు ఇక్కడ జిల్లాసర్జన్ గారిని వూన్చి వైద్యముజరిపింపుమని తంతె నిచ్చుచు "Render all help Ananthachari I responsible" అని అప్పటిలో మునిసిపల్ చేర్మన్ పని చూచుచుండిన ప్రొగ్రెసివ్ యూనియన్, కార్యదర్శి శ్రీ రేబాల సుబ్బరాయుడు గారికి వ్రాసినారు. పూర్వము స్నేహాలత ఇట్టిపనులను చేయిం చెడిది. అప్పుడు పెద్ద ఆస్పత్రి మునిసిపాలిటీ వారిదిగా నుండెను.

ఈ అనంతాచార్యులు స్టేజ్ డైరెక్టరు హోదాతో నిర్వహించిన విధము:— అర్ధరాత్రి దాటగనే ఇల్లువెడలి వేష ధారులుగా ఏర్పడినవారి ఇండ్లయొద్దకుపోయి ఒక్కొక్కరిని లేపి పిలిచికొని ఒద్దిక గృహముచేరి పాఠములు చదివించి ఒప్పించు కొనెడివారు. తిరుగ అందరు (ఆఫీసులకు పోవలసినవారగుట) 8½ గంటలకే తమతమ ఇండ్లు చేరిపోయెడివారు అంతటి శ్రద్ధ. మరి వీరు బృహన్నలలో కీచక పాత్రను ధరించినది నేను చూచి యున్నాను. చాలా బాగుగా నటించినారను ప్రఖ్యాతి వీరికి కలదు.

వీరి పేర ఇచ్చిన బహుమతి పతకములు, వీరి కుమారుడు రావుసాహెబు కే. ఎస్. రామానుజాచార్యులు (లక్నో) గారిచే నొసగబడి ఒక బీరువ గ్రంథములు తిక్కన పుస్తక భాండాగారమునకు చేర్చబడియున్నవి. వీరి మరియొక కుమారుడు రాజగోపాలాచార్యులు నెల్లూరు జిల్లా కో-ఆపరేటివ్ బ్యాంకిలో గుమాస్తాగా ఇక్కడనే యున్నారు. వీరు తమ తండ్రిగారి ఛాయాపటము నొకదాని నొసంగియున్నారు. అదియు పై గ్రంథముల బీరువను కట్టి ప్రొగ్రెసివ్ యూనియన్‌లో ఉంచబడియున్నది.

ఈ సభవారి వ్రాత కాగితములో తే 8-1-98 ది గల యీ క్రింది సభ్యత్వపు దరఖాస్తు ఒకటి కార్యదర్శులకు వచ్చి దానిపై "Recorded" అని తీర్మానింపబడియున్నది. (అనగా ఆ అర్జీ మంజూరు కాలేదన్నమాట) ఆ దరఖాస్తు కీ॥ శే॥ యరగుడిపాటి వెంకటాచలం పంతులు వారిది. అంతయు వారి స్వహస్తాక్షర లిఖితముగా యున్నది. వారి అక్షరముల నేను గుర్తింపగలను. దానిని ఇందు పొందుపరచుచున్నాను.

"To

The Secretary to the

AMATEUR DRAMATIC SOCIETY,

NELLORE.

SIR,

Seeing the good work your Society is doing

I have a great liking to have some connection with it.

I therefore request you to be good enough to enroll my name in the list of *Passive Members* of your Society, I will abide by all your rules and pay the amount of subscription you may prescribe.

I beg to remain,
your most obedient servant,
Y. VEVKATACHELAM"

ఇందువలన నాటకములలో పాత్రధారణము చేయకయు, కార్యభారము లేమియు వహింపకయు నుండు సభ్యవర్గమొకటి ఆ సభలో నుండియుండెనని తెలియుచున్నది. అట్టి వర్గములో చేరినవారే కాబోలు పై చెప్పిన జిల్లా జడ్జిగారును, స్కూలు హెడ్మాస్టరు గారును. (ఈ రెండవవారి రూప పటము కాలేజి హాలులోనున్నది.)

(శ్రీ) పంతులవారు అప్పటి వయసులో ఇతరసామాన్య సభ్యులలో చేరు నుత్సాహమును చూపింపక పోవుట ఏలనో తెలియదు. అది కారణముగానే కాబోలు వారి దరఖాస్తును ఒప్పికొనక ఊరక Recorded అని మాత్రము వ్రాసి అట్టె పెట్టినారు. వీరిసహోదరులు కీ॥ శే॥ యరగుడిపాటి గోపాల కృష్ణరావుగారు ఈ సభా సభ్యులుగానుండి పాత్రధారణము చేయుచు కొంత కార్యభారమును వహించుచు కూడ నుండినట్లు మున్ముందు వ్రాయబోవు విషయమువలన తెలియగలదు

## అమెటుర్యార్ సభయందు-చీలిక

శ్రీ వేంకటరాయ శాస్త్రులవారియందు అందరికి ఎక్కువ గౌరవ మర్యాదలు ఎప్పుడును నెల్లూరువారికి కలవు, అంత మాత్రమేకాక ప్రతాపరుద్రీయనాటకము వారి స్వంత హస్తములనుండి వచ్చిన కారణమునను అందలి తమాషా మహామ్మదీయ చమత్కార బాషా భాగములు సభారంజకములుగా నుండు కారణమునను, ఆనాటకమునందు, శాస్త్రిగారియందు వలెనే ఒక అవినాభావసంబంధమైన సమాన గౌరవమర్యాదలు కలవారందరును అమెటుర్యార్ సభనుండి చీలిపోయిరి. అమెటుర్యార్ సభవారు తొలుతటి పద్ధతినే నాటకముల నాడుచు ఊరియందలి పెద్దపెద్ద ఉద్యోగులగువారి ఆదరణమును చూరగొని ఏవేని ప్రజోపయోగ కార్యములకే తమకు వచ్చిన ద్రవ్యమును వెచ్చించుచు జరుపుకొనువారైరి. వీరు కీ॥ శే॥ ధర్మవరం రామకృష్ణమాచార్యులవారి నాటకములు చిత్రనళీయము, విషాదసారంగధర, సావిత్రి చిత్రాశ్వము, బృహన్నల, ప్రమీలార్జునీయము ఇత్యాదినాటకముల ప్రదర్శించుచు నడుపుకొనుచుండిరి. వీరిలో నూతన సభ్యులు కొందరు చేరుటయు, నాయక నాయికా పాత్రలను ధరించుటకును సమర్థులయిన వారే కొందరు ఏర్పడుటయు నై జరుగుచుండినది. ప్రప్రథమమున వీరు ప్రదర్శించి యుండిన శ్రీ శాస్త్రిగారి శాకుంతలమున దుష్యంత పాత్రను ధరించిన వారై అంతకు

ముందు సంస్కృతమునసే ఆనాటకము నటించి అపర దుష్యం తుడు నా పేరుగాంచినవారైన శ్రీ దొరస్వామి అయ్యంగారు (కె. శ్రీనివాసన్) వారు ఆ చీలికకు సంబంధించిన ముఖ్యులైరి.

## 'ఆంధ్ర భాషాభిమాని సమాజము'

ఆ చీలినవారు పై పేరుతో వేరు సంఘముగా కూడి శ్రీ శాస్త్రిలవారినే అధ్యక్షులుగా నుంచుకొని వారి నాటకములు తప్ప మరి ఇతరములు ప్రదర్శనార్హములు కావని పోటీగా చెప్పుచు ప్రదర్శింప సాగిరి. అందరును ఎండాకాలపు సెలవులలో నెల్లూరికి (ఎక్కడ ఉండినను) వచ్చి చేరి, వేరు వేరు పందిళ్ళు వేసికొని వేరుగా నాటకములను ఆడుచుండిరి. ఆంధ్ర భాషాభిమాని సమాజము క్రమక్రమేణ మంచి నట బృందమై అందు శాకుంతలము, నాగానందము మొదలగు నాటకములలో ప్రధాన పాత్రను ధరించు దొరస్వామి అయ్యంగారు (కె. శ్రీనివాసన్) గారిని చూచుటయే ఆనందముగాను అపర అప్సరస స్త్రీయన నొప్పారిన శ్రీ నందగిరి హనుమంత రావు గారిని శాకుంతలమున శకుంతలగాను, శాస్త్రిలవారి ఉషానాటకమున ఉషగాను చూచుటయె ఒక విశేషముగాను నుండి మంచి పేరు నార్జించి ద్రవ్యమునుకూడ ఎక్కువగానే గడింపసాగినది. వీరికి ఏర్పడినవి 4 నాటకములు మాత్రమే

శాకుంతలము నాగానందము ప్రతాపరుద్రీయము ఈనా నాటకము. వీని నే ప్రతి వత్సరమును ప్రదర్శించెడివారు. ఇందు కడపటి రెండును శ్రీ శాస్త్రిలవారి సొంతములు. మిగతవి సంస్కృతమునకు వారిఆంధ్రీకరణములు. వీరు ఇట్లె చాలకాలము జరుపుకొనిరి. కీ॥ శే॥ శాస్త్రిలవారు పిమ్మట మదరాసు క్రిస్టియన్ కాలేజిలో శిష్యులకు చదువు చెప్పవలసి వచ్చిన ప్రియదర్శిక, ఉత్తరరామ చరితము, మాళవికాగ్ని మిత్రము ఇవన్నియు ఆంధ్రమునకు మార్పబడిన నాటకములు కాగా వానిని కూడ ప్రదర్శించుచు కడకు బొబ్బిలి నాటకమును శ్రీ శాస్త్రిలవారు సొంతనాటకముగా వ్రాసి ప్రదర్శించునాటికి శ్రీ దొరస్వామయ్యంగారు వారు సమాజమును వీడి పోయిన వారైరి. ఈ సమాజ సభ్యులలో ప్రబల విరోధము లేర్పడి పెద్దవారు చెదరి పోయిరి. పిమ్మట "బాలాంధ్ర భాషాభిమానులు" కొందరుచేరి కొంతకాలము కాగా ఈ సమాజము గ్రసించినది. ఆవివరము వెనుక వ్రాసెదను. ఇచ్చట శ్రీ దొరస్వామి అయ్యంగారు వారిని గురించి కొంత చెప్పవలసి యున్నది.

## కీ॥ శే॥ దొరసామి అయ్యంగార్

వీరే కే. శ్రీనివాసన్ గారు. వీరు ఆంధ్రభాషాభిమాని సమాజమునకు చెందినవారైన పిమ్మట ఒకే కట్ట నాటకములనే ప్రతి వత్సరమును ఆడుట వలన నాయక పాత్రను

ధరించుటయందు అసమాన ప్రజ్ఞావంతులుగ నేర్పడిరి. సమాజమునకు వీరివలననే గొప్ప ప్రఖ్యాతియు, వీరే సమాజముగను వర్ధిల్లి అనేకులకు వీరిని సమాజమునకు చెందినవారుగనే తెలిసియున్నది. కాని వీరు నెల్లూరులోగాక మదరాసులో ఇతర నాటకములలో పాత్రధారణము చేయుచునే యుండిరి. రాణి సంయుక్త అరవ నాటకములలో ఆంధ్ర భాషాభిమాని సమాజమున నాయికా పాత్రధారునుగా వెనక మంచి పేరు నార్జించిన సరస్వతి రంగస్వామిఅయ్యంగారును రాణిగా యుంచుకొని రాజు వేషమును వేసియుండుట వారెత్తుకొనిన ఒక పటమువలన తెలియగలదు. వీరు మదరాసు సుగుణవిలాస సభలో శ్రీధర్మవరం రామకృష్ణమాచార్యులవారి సావిత్రి చిత్రాశ్వనాటకమున "చిత్రాశ్వ" పాత్రమునుధరించి చిత్రాశ్వని సఖుడైన సుమాలిపాత్రను కీ॥ శే॥ బళ్ళారి టి. రాఘవాచార్యులు ధరింపగా నటించినది నేను చూచియున్నాను. వీరు శాస్త్రిలవారి ఆ నాలుగు నాటకములతో తృప్తిపడినవారు కారనియు వీరిఅన్నగారు కీ॥ శే॥ కేశవాచార్యులవలెనే వీరికిని శ్రీధర్మవరము రామకృష్ణమాచార్యుల నాటకములందే ఎక్కువ ఇష్టముండినదనియు వీరి ఆవలి చర్యల వలన అందరికి తెలిసియున్నది. వీరు శ్రీశాస్త్రిలవారి నటబృందమునుండి చీలిపోయి శ్రీ విక్రమదేవవర్మ విరచిత మానవతీ నాటకము (ఇందు ఉన్మత్తుడుగా నటించుటలో తమ నిపుణత్వమును చూపిరి.)

శ్రీనివాస కల్యాణము (ఇందు స్త్రీ పాత్రకూడ ఎరుకలసానిగా ధరించి బాగా నటించిరి.) వీనిని తెచ్చుకొని ఒద్దికలు కుదుర్చుకొని ఒక స్నేహబృందమును ప్రత్యేకముగా చేర్చుకొని నటించియుండుట ఇత్యాదులవలనను విదితము. పిమ్మట "నెల్లూరు సుగుణ విలాససభ" యని యొకటి నెలకొల్పికొని అందు శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులవారి నాటకములను ప్రదర్శింపించి, తాము నల సారంగధర చిత్రనళీయ హిరణ్యకశ్యప రాజనరేంద్ర యను పాత్రలను ధరించి రామదాసు నాటకమున తానీషా పాత్రను వహించి తాము స్వంతముగా రచించికొనిన హరిశ్చంద్ర నాటకములో హరిశ్చంద్రుడుగాను నిర్వహించి తమ తనవిదీర పాటలను రంగమున పాడి పాడించి జరిపియుండిరి. సందర్భానుసారముగ పద్యముల కన్న పాటలే ఎక్కువ రంజకములుగ నుండునని శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు చెప్పియుండిన దానిని అనుకరించియే వీరిట్లు అనుభవమున తెలిసి చేసిరి. ఆంధ్ర భాషాభిమాని సమాజమున నుండినపుడును ఆ నాటకములు నాగానందము ఉష వీనిలో పద్యములను అనేకములను పాటలుగా మార్చుకొని నాయక పాత్రయందును వీరు పాడియుంట పైన చూపిన వారి అభిప్రాయమునకు నిదర్శనము

ఇట్లు వీరు ఆత్మ తృప్తి గావించుకొనయే దివంగతులయిరనుట తెలిసియున్నది. వీరికి శ్రీధర్మవరము వారి నాట

కములయందు అభిప్రాయమే లేదని, ఆంధ్ర భాషాభిమాన సమాజమువారితో సరిపడక వైరుధ్యమున అట్లు నటించిరని అనువారు కొందరు కలరు. అట్టివారికి వారి స్వహస్తాక్షర లిఖితమగు ఈ క్రింది జాబు ప్రత్యుత్తర మీయగలదు. వారు ఈ జాబును అమెట్యూర్ నాటక సభా సభ్యులుగా ఆ సభా కార్యదర్శులకు తే 23-5-1898 దిన వ్రాసియుండియున్నారు. వీరికి అప్పటికి శ్రీ శాస్త్రిలవారినాటకములు తెలియనివి కావు. 1897 జూన్ తే 30 దిన శ్రీ శాస్త్రిలవారి శాకుంతలమును అమెట్యూర్ నాటక సభవారాడినపుడు దుష్యంత పాత్రను నిర్వహించియున్నారు. అమెట్యూర్ నాటకసభలో ప్రప్రథమ ప్రతాపరుద్రీయ నాటక ప్రదర్శనము 1898 సంవత్సరం జను వరి తే 14 ది అయియున్నది. వీరు ఈ క్రింది జాబును పంపు కున్నది 1898 సంవత్సరము మే నెల తే 23 ది. జాబంతయు వారి సొంత అక్షరములతో నున్నది. వారి అక్షరములతోనే ప్రకటించుటయందుగల అధిక వ్యయమున కోడి జాబును ప్రక టించుచు వారి చేవ్రాలు భాగమును మాత్రము అట్లె బ్లాక్ చేయించి తెచ్చి చదువరులవిశ్వాసమునకై వేయుచున్నాను.

"Ranganayakulapet,

Nellore, 23rd May 98

To The Joint Secretary,

AMATEUR DRAMATIC SOCIETY,

NELLORE

Sir,

About the end of January when I was first informed that the Society is going to put on boards all the Dramas of Mr. D. Krishuama-chariar in succession and that he has promised to hand his manuscripts over, to be copied by us. I thought of presenting the Society with some bound note-books I consequently ordered for them and they were ready in time. But I was not able to hand them over to the committee sooner. I am sending these note books and half a ream of paper along with this note. I hop you will be good enough fo accept them and inform me of the same. Hoping to be execused for the trouble.

I beg to remain.
Sir,
Your most obedient Servant
K. Srinivasan.

దీనికి వెనుక తే 15 ది జూన్ 1898 నాడు శ్రీ ద్రోణంరాజు భుజంగరావు అను ఆయన వ్రాసియుండిన ఈజాబు దొరికినది. ఇందువలన శ్రీ కే. శ్రీనివాసన్ (దొరసామిఅయ్యంగారు)గారు ఈ అమెట్యూర్ నాటక సభలో ఎంత ప్రాముఖ్యత వహించి

యుండినది తెలియగలదు. కొంతకాలము కార్యదర్శిత్వము నను నుండి యున్నారని గ్రహింపనగును.

To

The Members of the

AMATEUR DRMATIC SOCIETY.

Sir,

You all know that Mr. T. V. Muthukrishnan went away to Madras and I am sure he is not going to come over here before the end of this session and we have all the business of the Society to be done hereafter. So, I would propose Mr. K. Srinivasan in his stead and we will have to fill up the vacancy as early as possible.

Yours Sincearly,
(Sd) D. BHUJANGA ROW.

సభలో భుజంగరావుగారి హోదాఏమో ఎక్కడ వివరముగా తెలియలేదు కాని సభా కార్యముల నిర్వహణ మందు ప్రాముఖ్యత వహించినట్లుమాత్రము తెలియుచున్నది.

శ్రీ దొరసామి అయ్యంగారువారి ముఖ్య స్నేహితులలో శిష్యప్రాయులుగా నుండిన చిరుతప్రాయపు భక్తబృందములో శ్రీకాశి చెంచుసుబ్రమణ్యంగారు ఇప్పుడును నాటకములలోను సినిమాలలోను గొప్ప నటుడుగా ప్రఖ్యాతి చెంది

నటించుచునే యున్నారు. వీరు. శ్రీ దొరసామి అయ్యంగారు వారి ఛాయాపటమును నెలకొల్పుటకై చాల పాటుబడి నెల్లూరు లక్ష్మీనరసారెడ్డి పురమందిరమున దానిని నెలకొల్పించి యున్నారు. ఆ పటము చాల ఎత్తున ఉండుటయు అందు వారు నిలిచికొనియుండుటయు నగుట వలన వారి ముఖము చిన్నదై అందలి వైలక్షణ్యమును, ఆ కరాళమును బాగా తెలియుటలేదు. ఆపటము సైజుననే కంఠము క్రింది భాగము వఱకు మాత్రము దానిని పెద్ద తలగా కనుబడునట్లు చేసిన చాల బాగుండును. ఇట్టి పనులు త్వరత్వరగా పూనికతో జరిగిపోవలయును. ఆలసించుట కూడదు.

శ్రీ దొరసామి అయ్యంగారు పిదప రాజకీయ రంగమున ప్రవేశించి శ్రీగాంధి మహాత్ముని యందు భక్తి నెఱపి జైలుకు పోయియుండి అచ్చట నుండి వచ్చునప్పటికి చాల కృశించి వచ్చిరి. అప్పుడును పురజనుల నిర్బంధమున ఒక నాటకము నటించినారు. పిదప జబ్బుపడి కొంత కాలమునకు తమ ఆచార్య తిరువడి నాశ్రయించినారు. వారికి సంతానము లేదు. ఎక్కడనో దత్తపుత్రుడున్నాడని వినికి.

తే 14-5-1893 దిన శ్రీమాన్ కె. ఏ. వీరరాఘవాచార్యులవారు కార్యదర్శిగా ఒకజాబు సభ్యులకు వ్రాసియుండిరి. ఈసభవారి కట్టుదిట్టములు ఖచితమైన మార్గములు ఇందున తెలియగలవు. ఏసభవారును అనుకరింప తగినవి.

AMATEUR DRAMATIC SOCIETY.
NELLORE, 14-5-98

The under-signed has the honour to request the members of the Society to send in all complaints against the executive Council of the spring session of 1898 within 17th May. Any information, records concerning the work of that council, shall be placed at the disposal of the members subject to the provisions of the provisional rules.

By order,
(Sd) K. A. Veeraraghavachary,
Secretary.

పిమ్మట తే 17-6-98 ది గల ఈక్రింది జాబొకటి వ్రాసికొనబడి.

To
The Joint Secretaries,
Amateur Dramatic Society,
Sir.

In reply to your letter I beg to state that I have severed all my connections with the Victoria Diamond Jublee Association, Nellore.

I beg to remain,
Sirs,
Your etc. etc.
T. V. KASIRAMAN."

దీనినిబట్టి ఈ సభవారు ఇతర సభలలో నుండిన వారిని చేర్చుకొనక నిరాకరించుటయే ధర్మముగా భావించి ఆచరించి నట్లు తెల్లమగుచున్నది.

## శ్రీ వంగోలు వెంకటరంగయ్యగారు

1898 జూన్ నెల తేదీ 23 ది స్టోన్‌హౌసు పేట నుండి శ్రీ వంగోలు వెంకటరంగయ్యగారు ఒక జాబును ఇంగ్లీషులో వ్రాసి పంపియున్నారు, "సభా కార్యములన్నియు, దరఖాస్తులు తీర్మానములు అంతా రికార్డు తెలుగులో ఉంచవలసినది" అని. మరి ఏలనో ఈజాబును తాము ఇంగ్లీషులోనే వ్రాసి యున్నారు. ఈ జాబుపై ఏమితీర్మానమును జరిగినదిన్ని దొరక లేదు కాని ఇంగ్లీషుమీద ఎక్కువ వ్యామోహముండు ఆ కాలములో శ్రీ వెంకటరంగయ్యగారు ఆనాటికే తమకు గల ఈ అభిప్రాయమును మాతృభాషాపోషకులుగ నిట్లు తెలిపి యుండిరనుటకు సంతసింపవలసియున్నది. 1917-వ సంవత్సరములో నెల్లూరులో ఆంధ్ర మహాజనసభ (ఆంధ్రోద్యమము ప్రారంభదినములవి) జరిగినపుడు వీరు ఆహ్వాన సంఘాధ్యక్షులయి యుండిరనుట జ్ఞాపక ముంచుకొన తగినది. వీరు సారస్వత ప్రియులు. ఎక్కువగా గ్రంథావలోడనము చేయుచు ఆంధ్ర పదములన్నిటికి వ్యుత్పత్తిని ఏ యే భాషలనుండియో సాధించి తెలియచెప్పుటలో అనేక నూతన విషయములను బోధించుచు తమకు ఆంధ్రభాష యందుండు అభిమానమును ప్రకటించుచుండినవారు.

వీరు నాటక ప్రదర్శనములలో చాల శ్రద్ధవహించు చుండినారని అందును శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యుల వారి నాటకములయందే వారికి ఎక్కువ ప్రీతియని "కథా సందర్భముల జతగూర్పుటలో ఆ గ్రంథకర్తగారే ఒక గొప్ప నిధి" యనియు "రంగమున ప్రదర్శించుటకు మిక్కిలి అర్హములైన నాటకములు వారివే"ననియు అభిప్రాయపడి యుండిరని వారు విషాద సారంగధరను గురించి (పే 11 జీలో కనుపరచినట్లు) చెప్పియుండుటను బట్టియు వారితో సంభాషణలు గలిగినవారికి తెలిసియుండుటను బట్టియు దృఢముగా చెప్పతగి యున్నది. ప్రొగ్రెసివ్ యూనియన్‌లో గౌరవ సభ్యులుగా నుండినారు. వారు అమెట్యూర్ నాటకసభ స్టేజి డైరుక్టరుగా వ్రాసిన మరొక జాబు దొరికినది. అది తే 27 ది డిసంబరు 1899 లో వ్రాయబడి దాని వెనుక ప్రక్క సభ్యులందరి చేవ్రాళ్ళు అంగీకార సూచకముగా, పొడి అక్షరములలో నున్నవి. ఆభాగము చినుగులై యున్నది. జాబు సర్క్యులర్ శ్రీ నేలటూరు సింగరాచార్యులవారి ముద్దుటక్షరములతో పొంకముగా నుండియున్నది. చేవ్రాలు వెంకటరంగయ్యగారివి. "స్టేజ్ డైరెక్టరు" అను హోదాతో కనబడుచున్నవి-అది-ఇది-

To

The Members of the

AMATEUR DRAMATIC SOCIETY,

NELLORE.

Gentlemen,

(1) This Society consists of Amateurs and it is the love of the innocent pleasure of studying and enacting classic dramas that has brought them together.

(2) Some of the members, however, have lamentedly lost sight of this fact and seem to imagine that the society is creating divided interests.... ... ...

(3) It is time enough that members should rise above such Prejudies and help the common cause ... ... ... The bare discharge of duty to the body to which members have offered their services, is all that is expected.

(4) All the members know that the society has resolved to enact 'Sarangadhara' this session. The time before the scoiety is very short and it would be simply ridiculous if members should now keep back them selves and maintain airs of apathy.

(Sd.) O. VENKATARANGAYYA,
*Stage Director*
27—12—1899.

ఇందునుబట్టి వారు సభ్యులలోని వైమనస్యములను సరిదిద్దుచు, అందఱను కూర్చుచు, ఎంతో పాటుపడియుండిరని తెలియగలదు.

ఒకప్పుడు ఒక సభ్యుడు కార్యనిర్వాహక వర్గమునకు ఒక జాబు పంపుచు. దానిని, స్టేజి డైరెక్టరగు వీరిద్వారా పంపినారు. వీరును తే 30-10-19 ది సిఫారసుచేసి ఆ జాబు పై వ్రాసిపంపియున్నారు.

## కె. వి. రంగాచార్యులు

వీరే ఆ సభ్యులు. కే-అనగా- కొమాండూరు. ఇంతకు వీరి ఆ జాబులోని విషయము తనకు మొదట యిచ్చిన వేషమును మార్చినారని ఆ జాబుమీద 'Lodged' అని తీర్మానము వ్రాయబడి కనుబడుచున్నది. "ఎంతచిన్న విషయమునకు ఎంతపెద్ద ప్రదక్షిణము!" అని ఇతరులకు తోచును-కాని అవి ఆ సభ పద్ధతులు, ఆనాటికిని-ఈనాటికిని అవి శ్లాఘనీయములే యగును, "సారంగధర" లో ఆయనకిచ్చియుండిన వేషములు మూడు, ఎరుకల, పిచ్చివాడు, మతిమంతుడు. పిమ్మట మతిమంతుడి వేషము తనకు పనిలేదన్నాట "నేను ఎట్లు ఆవేషమునకు అనర్హుడనో!" అని ఆయన యీజాబు. ఇది ఒక అరఠావు అర్జీ- "As for as I know the primary object iu starting this society is to educate members in literaturo and in dramatic art. Coming to the direct point............ అని తనకిచ్చిన వేషమును మార్చినారని 'to my great disappointment' అని వ్రాసికొని now I request the Coumcil members అన్నాడు.

నటులకు పాత్రలిచ్చుటకు తీసివేయుటకు కార్యనిర్వాహక వర్గము వారికే అధికారముండినది. అది సత్యమే. ఈయన నెల్లూరు ప్రొగ్రెసివ్ యూనియన్ నందును సభ్యుడుగనుండి ఇటీవల చనిపోయినారు. మునిసిపల్ స్కూళ్ళ సూపర్ వైజరుగా నుండినారు. ఈయన నాటకరంగమున కండ్లు లేనివాడుగా కండ్లుమూసికొని యుండవలసిన వేషము (సత్యవంతుని తండ్రి ద్యుమత్సేనుడు) నకు అత్యర్హుడని పేరు వడసిన వారు. కండ్లు, రంగమున తెరచిన ఆభాసమగును. శ్రీ పామరాజు సుబ్బారావు అను వారును ఈ విషయమున సమర్థులు. ఈ సుబ్బారావు సన్యాసి అయి ఇప్పుడును ఉంటూఉన్నారు.

రంగాచార్యులు చిరుత ప్రాయములో మొదట ఇంగ్లీషు నాటకములో వేషము వేయువాడై పాఠము వల్లించుకొనుటలో పుస్తకములో ఆత్మగతముగా చెప్పికొనవలసిన మాటల సూచించుచు (aside) అని ఉండినదానిని బాగా వల్లించుకొని ఒద్దికలప్పుడు ఎన్నిమార్లు సవరించినను చక్కబడక తుదకు నాటక ప్రదర్శనమున అందరువినునట్లుగా గంభీరముగా aside అని చెప్పి ఆ పైమాటలనున్నూ చెప్పినారట-స్టేజ్ డైరెక్టరు వెంకటరంగయ్యగారు వీరిని "aside రంగాచార్లు"ని అంటూ వుండినారు. పిమ్మట మంచినటుడే అయినాడు ఈయన కుమారుడు కొమాండూరు దొరస్వామిఅయ్యంగార్, ఇప్పుడు సినిమాలలో ప్రఖ్యాత నటుడై సమర్థుడై పేరుగాంచి యున్నారు.

పరిప్రథమ శాకుంతలములో, శకుంతల పాత్రను ధరించినవారును, ఈ సభ కార్యదర్శిగా ఆనాడుండిన వారును నైన, కందాడై శఠగోపరామానుజాచార్యులవారు (వీరుడిప్టీకలెక్టరుగానైయుండి చనిపోయియున్నారు.) 1899 సం॥రం జూన్ నెల తే 7 ది తమ సభ్యత్వమునకు రాజీనామానిచ్చుచు, జాబొకటి వ్రాసియున్నారు.

దానిపైన కార్యనిర్వాహకవర్గ సభ జరిగి దానిలో నది చర్చకువచ్చి అదే తేదిన ఆ రాజీనామా జాబుపై ఈ క్రింది మాటలు వ్రాయబడియున్నవి.

"Mr. Ananthachari's proposition 'that Mr. Satakopachari be asked to pay the arrears of his subscription before his resignation is accepted" is passed by 3 votes against one, six being present.

Y. G. K.

7th June '99

పై పొడి అక్షరముల చేవ్రాలు శ్రీ యరగుడిపాటి గోపాల కృష్ణరావుగారివి. ఇదే విషయముగా 1899 సం॥రం జూన్ నెల తే 28 ది శ్రీ కనుపర్తి రామకృష్ణయ్యగారు కార్యదర్శిగా వారికి వ్రాసియున్నారు.

## శ్రీ యరగుడిపాటి గోపాలకృష్ణరావుగారు

వీరు అమెట్యూర్ నాటక సభయందు ముఖ్యులుగా

నుండినట్లు తెలియనగుచు. కార్యనిర్వాహక వర్గమున సభ్యులుగానుండి ప్రస్తావన రాజీనామాపై సొంతముగా వ్రాసియుండుట వలన ఆనాటి కార్యనిర్వాహక సభకు అధ్యక్షులను వీరు వహించియుండిరని ఊహింపనైయున్నది. వీరు చిత్రనళీయములో ఋతుపర్ణుడుగను, పాదుకా పట్టాభిషేకమున భరతుడుగను పాత్రధారణముచేసి చాల బాగ నటించిరని ప్రఖ్యాతి. భరతుని ఆగమనము అతని దుఃఖము ఆ భ్రాతృత్వ భక్తి ఇత్యాదులు బాగా ప్రదర్శింపబడిన వనిరి. వీరు కీర్తిగాంచిన గొప్ప నటులు. ఆవల ఆంధ్రభాషాభిమాని సమాజమునకు చెంది బాణాసురుడుగను చెకుముకి శాస్త్రిగను పాత్రధారణములనుచేసి, నాగానందమున గరుత్మంతుడుగను పేరుగాంచిన వారు. వీరి కుమారులు హనుమంతరావు (గూడూరు ప్లీడరు) వై. వి. రావ్, (సినిమా డైరెక్టరు) ఉన్నారు. వారును గొప్ప నటనా కౌశలమును కలవారే.

ఈ కనుపర్తి రామకృష్ణయ్యగారు అమెట్యూర్ నాటక సభలో ముఖ్యులు, వీరు అమెట్యూర్ వారి బృహన్నలలో ఉత్తరకుమారుని వేషము వేసి నటించియున్నారు. పాదుకా పట్టాభిషేకమున భరతుడిపాత్రను ప్రొగ్రెసివ్ యూనియన్‌లో వేసి చాలా బాగా నటించియున్నారు. మంచి విగ్రహమే. తాను సభ్యుడుగానుండు ఈ సంస్థలయందు అపరిమితమైన ప్రీతి శ్రద్ధలు కలవారు. తనకు సంబంధించిన సంస్థకు మించి

నది లేదని, దాని పద్ధతులు ఏర్పాట్లు చాలా మంచివని ఇతర ఏ సంఘము దీనికి సమానము కాదని గర్వించి చెప్పికొనెడి వారు. అమెట్యూర్ నాటక సభలోను, ప్రోగ్రెసివ్ యూనియనులోను కార్యదర్శిగాను కండక్టరుగను కార్యనిర్వాహక వర్గ సభ్యుడుగను పనిచేసినవారు. ఇతర నాటక సమాజములు ప్రత్యేకించి ఏర్పడుట ఏ మాత్రము ఇష్టపడక ఆ సభలలో అధ్యక్షస్థానములను వహించి నడుపుచుండు వారిపై చాల కోపమును చూపుచు "వేరు ప్రయత్నములేల" యని శ్రీ తూములూరు శివరామయ్యగారు మొదలగు వారితో వాదించుచుండెడివారు అమెట్యూర్ నాటకసభవారి ప్రాతరికార్డును జాగ్రతగా ఎంత శిథిలమైనను దాచియుంచి కట్టకడపట "నీవు తప్ప దీనిని ఉపయోగించువారు లేరు" అని నాచేతికి ఆ చెంపి కట్టనిచ్చి చనినారు. దానిని ముఖ్యాధారముగా కొనియే నేని గ్రంథమును వ్రాయుచున్నాను. వానికెంతెయు కృతజ్ఞుడను

1899 మార్చి తే 31 దిన నేటూరు సింగరాచార్యులు కే. ఏ. వీరరాఘవచార్యులు కార్యదర్శులుగా తమ సభా కష్టములు, ద్రవ్యాభావము ప్రతిదఫా ఎవరినైనా తెరలకు ఆశ్రయించి నాటకములు వేసికొనవలసిన ఇబ్బంది వీనిని గురించి తమలో యోచించుకొని నెల్లూరులో నుండిన ప్రముఖులగు శే. వసంతరావు పంతులుగారికిని జడ్జి స్వామినాథయ్యర్ గారికిని తదితరులకును వారివారి పేర స్మారకముగా

నుండునటుల ఒక్కొక్క రొక కర్టను (తెరను) తమతమ సొంత ఖర్చులతో వ్రాయించి సభకు యివ్వవలసినదిగా ప్రార్థేయపమును జాబులు వ్రాసియున్నారు. అందలి మాటలలో ఒక భాగము మాత్రమే దొరకియున్నది. అందలి అప్పటి రోజులలోని వారి మాటలు చదువరులకు కుతూహలము కలిగించునని ఇందు పొందుపరచుచున్నాను. ... ... ...

"May we entreat you to keep us under perpetual obligation to you by presenting us a Curtain in your name to keep your memory ever fresh in our minds. It is our earnest attempt not to make our society a mere dilattanti affair with a few hundreds spent for a night's waking, but a permanent and useful institution in Nellore with considerable good to the community. etc. etc.

Soliciting a favourable reply.

(Sd.) N. Singarachari.
K. A. Veeraraghavachari,
Secretaries

పెద్దలు శాశ్వతముగా ఈ సమాజమువారిని తమకు అనంతకాలము కృతజ్ఞతాబద్ధులుగ నుండునట్లుగా తమకు తెరలను వ్రాయించి యొసగమనియు ఏదియో ఒక నాటి నిద్రాభంగమును చేకూర్చుటకై కొన్ని వందల రూప్యములు ఖర్చు

పెట్టి పోవునట్టి విషయముగా కాక, శాశ్వతముగా చిరస్థాయిగా నెల్లూరు యొక్క అభివృద్ధికిని, శ్రేయస్సునకును పాటుపడు సంఘముగా ఈ అమెట్యూర్ నాటక సభను గ్రహింపవలయునని యు, అట్టి సేవకు పూర్తి అవకాశము యీ సభా సభ్యులకు ఒసగుదురుగాక యనియు కోరుచు వ్రాసికొనిరి.

ఈ క్రింది తీర్మానము కే. వి. వీరరాఘవాచార్యుల వారి స్వహస్తాక్షరములతో లిఖింపబడి సర్క్యులేషన్ ద్వారా సభ్యుల అంగీకారము కొనబడి రికార్డులో ఉంపబడియున్నది.

"Read letter from Mr. P. Ramakrishnaiah Garu asking help for Telugu Pandits' Congress. Resolved:— That the society do give a Telugu performance during the congress, the expenses of it being borne by the society and the selling of the tickets etc. being left to the hands of the congress committee, and the money collected being given entirely to the congress purposes.

The matter was given the best consideration of the council, every clause of it was fully discussed and the resolution itself was passed unanimously."

ఇట్లు పండిత కాంగ్రెసు (మహాసభ) కు కీ॥ శే॥ పూండ్ల రామకృష్ణయ్యగారి కోరికపై ఒక నాటకము సభవారు తామే

ద్ర్యాలన్నియు భరించుచు టిక్కెట్లు వలన గడించిన ద్రవ్య మును సంపూర్ణముగా ఆ కాంగ్రెసుకు యివ్వవలసినట్లు సద్బ్యాలేషన్‌లో అర్జెంటుగా తీర్మానించి తెలపియున్నారు.

## కీ|| శే|| కే. ఏ. వీరరాఘవాచార్యులవారు

వీరు ప్రత్యేకించి ఒక మహోదార గుణ సంపన్నులు. గవర్నరుగా మొదలుగాగల గొప్ప అధికారులందరితో మంచి స్నేహమును పాటించిన సామార్థ్య విరాజితులై యుండి సామాన్యజనమునకును నిరంతరము అందుపాటులో నుండుచు, గొప్పవారితోటి తమ స్నేహ పరిచయములవలని లాభమును సామాన్య మిత్రులకు ఎంతయేనియు ఉపయోగించినవారు. పరోపకార చింత చాల ఎక్కువగ కలిగినవారు. తాము ప్రారంభించిన అమెట్యూర్ నాటక సభ. తాము స్థాపనా చార్యుడుగ ఏర్పడిన నెల్లూరు ప్రొగ్రసివ్ యూనియన్ ఈసంస్థలు ప్రజోపయోగకరములై ప్రఖ్యాతములై ప్రకాశింపవలె నని, నెల్లూరు ఔదార్యము అన్ని జిల్లాలకు మించి, దిక్తటముల మ్రోగుటకై ఆశించి ఎంతయేనియు పాటుపడినవారు. తాము విద్యాభ్యాసము చేసిన వెంకటగిరి రాజాగారిస్కూలు "ప్రాత విద్యార్థుల సంఘు" ప్రారంభకులలో ప్రముఖులు. ప్రొగ్రె సివ్ యూనియన్ వారిచే రాజాగారిస్కూలుకు హాస్టలు నొక దానిని నిర్మించినవారు. పేద విద్యార్థులకు "నల్లపరెడ్డి సుబ్బారెడ్డి" స్మారకముగా ఈనాడు జీతముల నిచ్చుచుండు

విధిస నెలకొల్పుటకై పాటుపడి జరిపినవారు, నెల్లూరున "పురమందిరము" నెలకొల్పవలయునను ప్రయత్నమును ప్ర ప్రథమున ప్రారంభించినవారై పిమ్మట కీ॥ శే॥ రేబాల లక్ష్మి నరసారెడ్డిగారు ఆమందిరమును నెలకొల్పగా ఆమందిర ప్రాము ఖ్యతకై ప్రాగ్రెసివ్ యూనియన్ వారి ధర్మ పఠన మందిర మును (మొదట నల్లపరెడ్డి సుబ్బారెడ్డి పేర నుండిన దానిని) అచ్చటికి మార్పించిరి. కీ॥ శే॥ లక్ష్మీనరసారెడ్డిగారి ముఖ్యస్నే హితులై, గౌ॥ సర్ పి. శివస్వామిఅయ్యర్ గారిని శ్రీరెడ్డిగారి సొంత గృహారామమున విందు స్వీకరింప నంగీకరింపచేసి శ్రీ రెడ్డిగారి మనసున కానందము కలిగించిన ఏకైక ఘనుడు. ఇక్కడ వెంకటగిరి రాజాగారి స్కూలులో ఉపాధ్యాయులై యుండి పిమ్మట మదరాసుకుచేరి పచ్చయప్ప కాలేజీలో నుండి విశ్వవిద్యాలయమున భూగోళ విషయిక ఉపన్యాసకులై ఆవల మూకమిలన్ కంపెని వారికి మద్రాసు రాష్ట్రమునకు విద్యావిషయక సలహాదారుడై రాజకీయములలో ప్రవేశము గలిగి లిబరల్ లీగు, మదరాసు మహాజన సభ వీనికి కార్యదర్శియై అఖిల భారత కాంగ్రెసు మదరాసులో జరిగి నపుడు దానికిని కార్యదర్శియై నెగడినాడు. పిమ్మట శ్రీ కంచి వరదరాజస్వామివారి దేవాలయమున తన వంశానుగతమైన ప్రధాన ధర్మకర్తృత్వమును వహించియుండి స్వామివారి తేరు తగులబడిపోగా దాని పునర్నిర్మాణమునకై పూని అనేక వేల

గూపాయ్యములను చందాలు వసూలుచేసి నిర్మించి భగవత్సేవ యందుండి అసువులు బాసిరి. వీరికి పిమ్మట నెల్లూరుపై అంతటి అభిమానము ప్రకటించి, నెల్లూరువాడని ఏ మనిషి కనబడినను (అతడు సంకోచించి దూరముగా పోవుచుండినను) దగ్గరకు పిలచి మాటలాడి వీలైన సాయముచేసి పంపునంతటి ఔదార్యము గలవారు మరొకరు ఈనాటికిని కనబడుట లేదని చెప్పుటలో అతిశయోక్తి ఏమాత్రమును లేదు.

వీరు ఒకమారు రంగస్థలమునకు వేషక వేషముతో వచ్చిరి. ప్రహ్లాద నాటకములో చదువుల బడిలో ఒక బడిపిల్ల వాడుగా పెద్ద నామములు వీపునకుకూడ ధరించి వచ్చి అందరు తెలిసినవారు ఎదుట మొదటి వరుసలోనే కూర్చుండి యుండగా వారిని చూడగనే తనకే నవ్వువచ్చి నవ్విరి. అందరు ఘొల్లున నవ్వగా లోపలికి వెళ్ళినారు. ఆ వెనుక ఒకమారు కృపాచారుడై బృహన్నలలో నిలువబడినాడు. రంగస్థలము తనదికాదని, పనిచేయుటయే తన వంతని తనకే బాగా తెలిసిన వారు. ఇతరులకును తెలియక పోలేదు. కాని రాక్షస బడి పిల్లవాడుగా ఒక పెద్దవానిని చూపుటకుగా వచ్చినాడు

## కీ॥ శే॥ నేలటూరు సింగరాచార్యులవారు

1899 సంవత్సరములో అమెట్యూర్ సభా కార్య నిర్వాహక సభవారు తమ సభా సభ్యుల కందరకు సమ ర్పించుకొనిన ఒక నివేదికను వీరు కార్యదర్శిగా తయారుచేసి

తమ స్వంత అక్షరములతో లిఖించియున్నారు. అందలి కొన్ని భాగములు:-

"Mr. President & Gentlemen.

Ever since this institution of ours first be held the light, many councils came and many went, and we, in our turn are to-day to retire

.... .... ....

We have acquitted ovrselves we think as best and honourable as we could. If still you have found us below the mark and it is quite possible, We request to be execused.

.... . . ...

The twilight of uncertainity has already thrown its shaddows and the night of forgetful-ness is we are sorry about to descend. Our work during the last session *will thus be buried in utter oblivion & posterity will have to search in vain for memorials of our days.* Determined therefore to avert if possible this threatened misfortune, we have set ourselves to work together a general way the fragments of what we have been able to do during the past session. We crave therefore your indulgence gentlemen to hear us read the follow-ing lines" etc. etc

(Sd) N. Singarachary,

1-6-99

రాగల సభ్యులకును ఇతర జనమునకును తమ ఆనాటి విషయములు తెలియనే తెలియక మాసిపోవునేమో యని వీరి సందేహము. అదియు తీర్పబడ యగుచున్నవి.

వీరు అమెట్యూర్ నాటక సభవారి ప్రప్రథమ చిత్రనళీయ నాటకమున దమయంతి, పాదుకా పట్టాభిషేకమున కైకేయి, ప్రమీలార్జునీయమున ప్రమీల, సారంగధరయందు చిత్రాంగ ఇట్లుగా స్త్రీ పాత్రలను ధరించుచుండినవారు. పిమ్మట స్వప్నానిరుద్ధ నాటకమున అనిరుద్ధుడుగనై, ప్రోగ్రెసివ్ యూనియన్ ప్రప్రథమ చిత్రనళీయమున నలమహారాజుగానై మరల చిరకారిలో "తిలక" అను స్త్రీ పాత్రనుధరించి అటు పిమ్మట అన్నింటను పురుష పాత్రనే-సత్యవంతుడు, రాజరాజు ఇత్యాది పాత్రలను ధరించుచుండిన వారు. వెంకటగిరి రాజాగారి కాలేజిలో ఉపాధ్యాయులుగా నుండి చాల శ్రద్ధతో, పూనికతో విద్యార్థుల అభివృద్ధికోరి చదువు చెప్పువారను పేరుగాంచినవారు. వీరు అమెట్యూర్ నాటక సభయందును, ప్రోగ్రసివ్ యూనియను నందును కార్యదర్శిగను కార్యనిర్వాహకులుగను కండక్టరుగను ఉండియున్నారు, సమర్థులు.

## శ్రీ మధుర శ్రీనివాసరావు

రంగనాయకులపేట చిత్రకూటములో నివసించుచుండిన ఒక పెద్దాయన శ్రీ మధుర శ్రీనివాసరావుగారి సభ్యత్వపు

దరఖాస్తు వారి సొంత అక్షరములతో వ్రాయబడినది, [M. N. Srinivasa Rao అని చేవ్రాలున్నది] దానిపై కార్యదర్శియైన K. A. వీరరాఘవాచార్యులు "This is probably a very good acquisition and I heartily support this" K. A. V. అని వారి సొంత అక్షరములతో వ్రాసియుంచి యుండినదియు దొరికినది. ఈ దరఖాస్తుదారైనవారు ముసలాయనగా చిత్రనళీయ నాటకము (ప్రొగ్రెసివ్ యూనియన్ వారి ప్రథమ ప్రదర్శనము) లో భీమరాజుగా వృద్ధ నృపతి వేషము వేసినది నేను చూచినవాడను. సంగీత మున నిధి. 1910 లో యూనియన్ స్టేజి డైరెక్టరుగనుండినారు సద్గుణములు కలవారు. విశేష ప్రీతి విశ్వాసములతో చిన్న వారిని అరయువారు, ఈనాడు లేరు. వీరి ఇంట ప్రతి శని వారమును భజనలు జరిగెడివి. రంగనాయకుల పేటలోని వారందరు విశేషముగా కూడెడివారు. ఫండాఫీసు బంగారయ్య గారు (సమాజమువారు) నేలటూరు (పప్పు) వరదాచార్యులు (యూనియన్) వారు అందరు అభేదముగ పాల్గొనుచునుండెడి వారు, కోర్టు కాపీస్టు శ్రీ ఇనుంచి నరసింహాచార్యులు వీరి శిష్యులు. తేరు ఉత్సవము, ముక్కోటి ఏకాదశి ఇట్టిదినములలో దేవుని వెంట తమ భజన పార్టి చుట్టివచ్చుచుండునట్లు చేసి జరిపినారు. ఇప్పుడు అట్టివి చేయువారు లేరు.

అమెట్యూర్ నాటక సభయందు ప్రఖ్యాత నటులై

యుండిన వారిని గురించి చాపల్యమేయగుఁగాక కొంత చెప్ప దలచితిని.

## శ్రీ అంబార్ఖానా కృష్ణమూర్తిరావుగారు

వీరు స్త్రీ పాత్రను ధరించువారు. దివ్యమంగళ విగ్రహము. పాదుకా పట్టాభిషేకమున మందర పాత్రను ధరించి మహానిపుణతతో నిర్వహించిన వారని వీరి ప్రఖ్యాతి. వీరికి సంగీతము పాడుటమాత్రము అబ్బియుండలేదు. భగవంతుడు సంపూర్ణతను ఎందును నెలకొల్పడుగదా! అందువలన వీరు నాయికా పాత్రలను ధరించుటకు వలనుపడినదికాదు. కాని స్త్రీ పాత్ర నటనా కౌశలము సమగ్రముగా కలిగిన వారు. సౌశీల్యము, మాధుర్యము, గండాగొండితనము, తళుకు బెళుకులు అన్నియు తెలిసి ఒద్దిక యొజ్జగా బాగా నేర్పువారు వీరియొద్ద శ్రీ పులిగండ్ల రంగయ్య, శ్రీరాజమన్నార్ అయ్యంగార్ అనువారు మందరపాత్ర నటనమునకుతయారైరి. శ్రీరావు గారు నెల్లూరు స్టేషనరీ సబ్ మేజిస్ట్రేటుగా నుండినారు. గర్వ మెరుగరు. ఇప్పటికాలమున రివిన్యూఇన్స్పెక్టరు ఉద్యోగమునకే గొప్ప హోదా వచ్చినదని తెల్లదొరల వేషము బుట్ట వేయువారికి వీరిని గురించి వినిన సిగ్గు కలుగును. ఆఫీసు విడువగనె తన మామూలు మొగ్రపంచ సన్న జబ్బా పైన తుండుగుడ్డతో వీధిలో తిరుగువారు. ఒద్దిక గృహమునకు వచ్చి నటించి నేర్పువారు. అందరిలో కలసి మెలసి యుండు

వారు. తన కోర్టనుమాత్రం మునసబు కోర్టువలె దర్బముతో జరుపుకొనుటలో ప్రసిద్ధి చెందిన వారు. పోలీసువారును ఇతర కక్షిదారులవలె దూరమునుండి వాదించవలసినచోట నిలిచి వాదించి, ఉండవలసినచోటనుండి పోవలసినదే. పోలీసువారు తెచ్చిపెట్టిన ఏ కేసుకుగాని వారితో కలిసినట్లు సర్కారేమనుకొనునో అను భయముతోవర్తించుట నెరుగరు. గెలిపింపనే వలయుననుట నెరుగరు. అనేకముగా త్రోసిపుచ్చువారు. జడ్జిమెంటులు అద్భుతముగా వ్రాసి తిరుగ అప్పీలుకు సందివ్వనివారు. వీరు సావిత్రి తండ్రి అశ్వపతిగాను, ప్రమీలను వరించిన అర్జునుడుగాను రంగమున నటించియున్నారు. సమర్థులు. వయసు మీరకనే చనిపోయినారు.

## కొవాండవారు శ్రీనివాసరామానుజాచార్యులవారు

వీరు గవర్నమెంటు ట్రెయినింగు స్కూలులో ఉపాధ్యాయులై యుండి మార్కాపురములోను ఇతర చోట్లను డిప్టి ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సుగా నుండినారు. 1910, 11 లలో యూనియన్లో కండక్టరుగా నుండియున్నారు. వీరు నాయకుని పాత్రను ధరించెడివారు. మంచి గంభీర స్వరము. బాగాపాడ గలిగినవారు. దండి విగ్రహము వీరికి ఒక కాలికన్న మరొక కాలు కొంచెము పొట్టియగుటలో వ్యత్యస్థ పాదము కలవారైనను, రంగమున అది తెలియకుండునట్లు నటించువారు. సావిత్రిలో ఘుటకేతుడు, యముడు; సారంగధరలో రాజరాజు; పాదుకలో

దశరథుడు; స్వప్నవాసవదత్తలో జాణ సుసుమ; ప్రమీలలో మేఘనాథుడు; చిరకారిలో మేధానిధి. అన్నిట మంచి పేరు నార్జించినవారు. మేధావంతుడు. కడపట ఉగ్రసేనుడుగా సుభద్రా విజయ నాటకమునందు నటించినారు.

## శ్రీ సి. జయరాజారావు

వీరు కోర్టులో గుమస్తా ఎప్పుడు ద్యూటి విషయములో ఖడీల్ మీద ఉండువారు. తన పని యంత్రో అంతే. ఇంటిలో తనకు వలయు ప్రతివస్తువయు తానే తయారు చేసి కొనెడివారు. సుత్తె, ఉలి, శాడ్స్ అంపము అన్నిటిని రెడిగా పెట్టుకొని యుండువారు. తాటి ఆకు బుట్టలు అద్భుతమైన పనితనముతో అల్లెడివారు. విసనకర్రలు సొంతము వి. తనషర్టు గుండీలు ఏదో పెముత్తోనో కొయ్యతోనో చేసి మధ్య ఒక త్రాడు కట్టికొన్నవి తప్ప కొనుక్కొన్నవి ఆయన వేయనే వేయు లేదు. ప్రతినాటకమునను దౌవారిక కుడి వేషమునకు హాజర్, మహా నవ్వు పుట్టించుచు తాను నవ్వు మొగము పెట్టనివాడు. బృహన్నలలో హాలాయుధుడుగ మూగవాడై అద్భుతముగ నటించిరని వీరికి పేరు కలదు. వీరు ఎక్కడ ఉండినను, రిటైరయిన పిమ్మట చు యూనియన్ మీద శ్రద్ధతో క్రమముగా చందా మణియార్డరు ద్వారా పంపేవారు. అడుగ పనిలేదు.

## శ్రీ మహంకాళి సుబ్రహ్మణ్యంగారు

అమెట్యూర్ నాటక సభకు చెంది కార్యదర్శిగా

మొదటి దినములలోనే ఉండియున్నారు. రాజాగారి స్కూలులో అయ్యవారుగానుండి ఆవల స్కూళ్ళ ఇన్స్పెక్టరయి రాజమండ్రిలోనే నివాస మేర్పరచుకొని యుండి చనిపోయినారు. సభయందు అత్యంత శ్రద్ధచూపెడివాడు. ప్రతాప రుద్రీయము ప్రదర్శించుటలో ముఖ్యమిత్రులు ఇరువురు చనిపోవుటయు, నాటకము బాగుండ లేదని అందరు చెప్పుటయు నేర్పడి వీరును అది "పిచ్చివాండ్లురంగమున ప్రదర్శించు పిచ్చి నాటకమని" సభలో చెప్పిన ధైర్యశాలి—అశ్వత్థామగా బృహన్నలలో ప్రోగ్రెసివ్ యూనియనులో కడపటి వేషము.

## శ్రీ ఇందుర్తి వెంకటకృష్ణరావుగారు

వీరిని గురించి జ్ఞాపకము వచ్చుచున్నది. వీరు సారంగధరుని పాత్రను ఎక్కువగా ధరించువారు. వీరికి "ఆరభి" రాగమన్న మహాప్రీతి. చాలబాగము ఆ రాగమునే పాడువాడు. ఏరాగము నెత్తి పాడబోయినను అది ఆరభికే దిగును. ఆ రాగము పాడుటలో ఆనందపరవశుడై రంగమునందును కండ్లు త్రిప్పుచు, ఊర్ధ్వమును చూచుచు, చేతులు త్రిప్పుచుండెడివారు. మంచి కంఠము. రూపరి కూడ. బృహన్నలలో అభిమన్యుడై ఉత్తరా సతిని పామునుండి తప్పించి మోహింపబడెడివాడు. అమెచ్యూర్ నాటక సభవారి ముఖ్యులలో నొకడు. సభయందు చాల శ్రద్ధ కలవాడు. దివంగతుడు

1901 సంవత్సరము జనవరి తే 14 ది గిరి చేర్వాలతో (అధ్యక్షులుగారలు) కార్యనిర్వాహక సభ తీర్మానములు పెన్సిలుతో వ్రాయబడినవి దొరికినవి. అందు, సభకు హానికరమైన పనులు చేసినారని తొలగింపబడిన నేలటూరు వరదాచార్యులు (సమాజములోని బంగారయ్య యుగంధరుని తమ్ముడు) అంతలో రాజీనామా నిచ్చికొని యుండినట్లును అందుపై ఆయనమీదచర్యతీసికొనిన తీర్మానముపై ఒంగోలు వెంకటరంగయ్యగారు కార్యనిర్వాహక సభవారికి "అప్పీలు" పెట్టినట్లును తెలియును. ఇల్లె మంగు రామానుజరావుగారు "సూర్యాలోకము" అను పత్రికలో ఏమేమో వ్రాసినారని ఆయనపై చర్యగొనగా ఆయన తే 29-12-1900 దిన ఒక సమాధానము (Explanation) వ్రాసికొన్నట్లును అందుపై వారి విషయమైన ఆ కాగితములను, సమాధానపు జాబును సామాన్య సభ్య సమావేశమున చర్చకు పంపినట్లును తెలియును. శ్రీ వెంకటరంగయ్యగారే "సావిత్రి చిత్రాశ్వ"నాటకమున తుదినుండు "నీతి సందేశము"ను 500 కాపీలు అచ్చొత్తించి నెల్లూరులోని బాలికా పాఠశాలలకు పంపకము చేయవలసినదని కోరి, అట్లు జరుప తీర్మానింపబడి యున్నది. మరియొక తీర్మానము— కార్యదర్శులు, సభ్యులు కానివారికి ఇకపుడికి స్టేజి లోనికి ప్రవేశ మొసగినందులకై వారి

చర్యను ఖండించుచు దీనిని గురించి తీక్ష్ణముగా ఆలోచింప వలెనని సామాన్య సభ్యులకు సిఫారసు చేసినట్లును ఉన్నది.

ఈ సమావేశమున నే శ్రీదుర్భా రామయ్యగారి సభ్యత్వ దరఖాస్తు ఆమోదింపబడి వారు సభ్యులై యున్నారు.

## 'సావిత్రి' నీతి సందేశము

శ్రీ ఒంగోలు వెంకటరంగయ్యగారు ఆచ్ఛాదించి పంపకము చేయుమనిన "సావిత్రి" నీతి సందేశము నందలి కొన్ని సూక్తులు ఇందు పొందు పరచుచున్నాను.

"యింతికి 'పతిభక్తి' ఇష్టదాయకము
కాంతకు 'పతిభక్తి' కలుష శోషణము
రామకు 'పతిభక్తి' రత్నభూషణము
భామకు 'పతిభక్తి' బహుజన్మ ఫలము
కలికికి 'పతిభక్తి' కామితదాయి
చెలదికి 'పతిభక్తి' వెలలేని సొమ్ము
మెలతకు 'పతిభక్తి' మేల్నిధానంబు
'పతిభక్తి' రమణికి పరమ భద్రంబు
'పతిభక్తి' చామకు బహు సౌఖ్య కరము
'పతిభక్తి' లేమకు పరముక్తిదంబు
వ్రతియింపగా ! నుపవాసంబు లేల?
నటమటింపగ ! తీర్థయాత్రాదు లేల? ఇత్యాదివి.

## శ్రీ దుర్భా రామయ్యగారు

వీరు ప్రవేశించి పృచ్ఛ పడుచు పిల్లాగా జెడ ప్రేలాడ వేసి

కొను స్త్రీ వేషము ధరించెడివారు. సన్నని మాధుర్యముగల కంఠము. వీరిని స్వప్నానిరుద్ధ నాటకమున ఉషగాను, సావిత్రి చిత్రాశ్వములో సావిత్రిగాను చూచియున్నాము. ఇంకను అన్ని వేషములు నటనా కౌశలము కలిగి వేసినవారే. 1909 లోనే అసిస్టంటు సెక్రెటరీ అయినాడు వీరు కలెక్టరు ఆఫీసులో ఉద్యోగి. గవర్నమెంట్ సర్వెంట్స్ కో-ఆపరేటివ్ సొసైటికి అధ్యక్షులుగా సేవచేసినాడు. వీరి సేవా విశేషతను గమనించి వీరిఛాయాపటమును ఆ సొసైటిలో నెలకొల్పియున్నారు. రూల్సు మనిషి ఇది కొందరికి కష్టముగానుండెడిది. వీరికి కంటి జబ్బు వచ్చి కండ్లు కనబడక పోయినవి. చెవుడు ముందు కొంచెముండెడిది ఇపుడు అపరిమితము. ఇంకను ప్రొగ్రెసివ్ యూనియన్ చందా నిచ్చుచు సభ్యుడుగా నున్నారు. దగునంతు రాత్రైః తన భార్య పేర స్మారకముగా ఒక బీరువను యూనియనులో నెలకొల్పి యున్నారు. వీరు ప్రొగ్రెసివ్ యూనియనులో Steward గా 1915; 16 లలో నున్నారు. ఇట్లె ఇంకను అనేకులు చిన్ని పాత్రముల ధరించు వారైనను వారి నైపుణ్యమును ప్రఖ్యాతముగ చూపిన ప్రాంత వారు గలరు.

## కొందఱు ఇతర నటులు

ఆదూరు సీతారామయ్యగారు (రాజ రాజు) నేలటూరు శ్రీనివాసాచార్యులు (రత్నాంగి, చిరకాలిలో చంద్రరేఖ, స్వప్నానిరుద్ధలో చిత్రరేఖ) 1919, 20, 29 లలో కండక్టరుగా నుండియున్నారు.

నేలటూరు వెంకటరంగాచార్యులు ఆ కృష్ణమాచార్యులు అన్నదమ్ములు. ఎట్టి స్త్రీ పురుష పాత్రలనైన ధరించెడివారు ఇద్దరు ఇంజనీర్లు 2-వ ఆయన ఇప్పుడును సజీవి సి: ఆర్. కృష్ణమాచార్యులు చిన్న నాడే ప్రమీలలో నృపకేతువు, ప్రొగ్రెసివ్ యూనియన్ ప్రథమ సహాయ కార్యదర్శియై చాల శ్రద్ధవహించి పని చేసినవారు, పులిగండ్ల వెంకట కృష్ణయ్య పిల్లికండ్లు కీచుగొంతు, మంచి రూపరి పల్లెర వేషముల ధరించువారు. దుర్భా చిదంబరయ్య. నేలటూరు కృష్ణస్వామి అయ్యంగార్ (సుబుద్ధి వేషధారి) అమంచర్ల ఆది నారాయణరావు వకీలు కావలి, (భీముడు వేషము) కోమాండూరు వీరాస్వామి అయ్యంగారు (రెడ్డి సేవక వేషము) నల్లపల్లి కృష్ణస్వామి శెట్టి, వలివొండి శ్రీనివాసరావు (టిక్కెట్లు) ఇత్యాదులుండిరి.

## ఒక సభ్యత్వపు దరఖాస్తు

"Sirs,

As I wish to become a member of your Society I put in this application which I hope you would accept,

I am, yours truly,

S. Rangachariar."

వీరేశస్వామి రంగాచార్యులవారు (ప్లీడరు, సంతపేట) కార్యదర్శి కే. ఏ. వీరరాఘవాచార్యులు దరఖాస్తు క్రమపద్ధతిలో లేదని తిరుగగొట్టి ఇట్లు వ్రాసియున్నారు. "The application is not in proper form and so he be asked to submit it in proper form" ఆ రోజులకు

అందరు "Beg to remain, your most obedient servant" అని వ్రాసికొనుట ఆచారమై యుండెను. ఈయన ఆమాటలు వ్రాయలేదు సరిగదా తుదకు "request" కూడ లేక దర్జాగా Hope తో పంపి, తాను చేసుటకు "ఎవరు వలదందురు" అని అభిప్రాయపడినట్లున్నారు. ఇట్లయినది.

అమెట్యూర్ నాటక సభనుండి చీలి ప్రత్యేకముగా శాస్త్రిలవారి నాటకములనే ఆడుచుండిన ఆంధ్రభాషాభిమాని సమాజమును గురించి 23, 24 పేజీలలో వ్రాసియున్నాను. ఈ సమాజమువారికి అమెట్యూరు వారితో ఒక విధమైన సరిపడని తనము ఉండుచుండినది. ఒక్కొకమారు సభవారి నాటక దినముననే సమాజమువారు తమ నాటక ప్రదర్శనము చేసెడివారు. సమాజమువారు తమ ద్రవ్యమునంతయు క్రొత్త డ్రెస్సులు, సీనులు వాటిమీద ఖర్చుపెట్టి జనాకర్షణము చేయసాగిరి. నటులు ఉభయసంఘములలో పెద్దవారగుచు వచ్చిరి. వీరిలో ప్రఖ్యాతికి వచ్చిన నటులను స్మరింపదగును.

నేలటూరు తిరువెంగళాచార్యులవారు వీరే

## ఫండాఫీసు బంగారయ్య

వీరు గొప్ప ఆజానుబాహువైన విగ్రహము. యుగంధరుని పాత్రను ధరించుటకు వీరిసాటి లేరని అందురు. ప్రాతకాలపు ఆస్థాన మంత్రులవలె వారి వేషము ఆ పగిడీ, మోకాళ్ళ క్రిందికి జారు కోటు, పై అంగవస్త్రము మనిషియొక్క పొడు

గునకు తగినట్లు చాల అందమును కూర్చెడివి. వీరు మొదట తురక సర్దారుగా వచ్చుటయు గలదు. ఆ దర్జా, ఆ ఠీవి ఆ పెద్దరికపు మర్యాద గౌరవ సంభాషణ (ఇప్పటి చిన్న చిన్న వారివలె ఇటు అటు పరుగిడుట లేక) చాల బాగుండెడిది. వీరు శాకుంతలమున కణ్వమహర్షియై ఆశ్రమమునుండి శకుంతలను వీడుకోలొసంగి భర్తృగృహమునకు పంపుటను వీరు నటింపగా చూచి తీరవలెను. అందరు దుఃఖసాగరమున మునుగ వలసినదే. వీరు మధ్యకాలమున ఆంధ్ర భాషాభిమాని సమాజమును వీడినారు. శ్రీ శాస్త్రిలవారితోనే వైమనస్యము కలిగినది. అప్పుడు ప్రొగ్రెసివ్ యూనియన్‌లో సభ్యులై సారంధర నాటకమున "రాజరాజ నరేంద్రుని" పాత్రను గైకొని బద్దిక గృహమునకు శిఖరంవారి వీధికి వచ్చుచుండినారు. కాలాంతరమున ఆ నాటకము నప్పుడు నిలిపి వేరొక నాటకము నాడుట కాగా, వీరు తాము యూనియన్‌లో చేరినందులకు గుర్తుగా సూత్రధారుగ మాత్రము వచ్చి నాంది పద్యమును చదివి పోయినారు.

కడపటి దినములలో మరల శ్రీ వేంకటరాయ శాస్త్రులవారు వీరిని పిలిపించికొనగా వచ్చి బొబ్బిలి నాటకమున తాండ్రపాపారాయుడుగా బ్రహ్మాండభయంకరవిగ్రహముగా ప్రవేశించి అత్యద్భుతముగా నటించియున్నారు. ఇప్పుడు దివంగతులు. వీరి కుమారుడు శ్రీనివాస రంగస్వామిఅయ్యంగారును

మంచి సఖుడై యున్నాడు. (రాజాగారి స్కూలులో డ్రాయింగు టీచరుగా నున్నాడు.)

## శ్రీ వెంకటాచలం పంతులుగారు

వీరు ఢిల్లీ సుల్తాను వేషధారి, నాగానందమున శేఖరకుడుగను; జీమూతకేతువుగను నటించువారు. వీరి స్నేహితులు గోపాలకృష్ణరావుగారు లేకపోయిన పిమ్మట బాణాసురుడుగను వర్తించి యున్నారు. గొప్ప వృద్ధమహీపతి వేషమునను వలయు సంస్కారము బాగుండెడిది. సంస్కృతమును బాగా నేర్చినవారు. వీరికిగల హిందూ మతాభిమానము, శాస్త్రీయ పద్ధతుల ననుసరించిన వైదిక కర్మాదులయందుగల ఆసక్తి ప్రీతి ఉత్సాహములు. ప్రశంసింపతగినవి. యజ్ఞయాగాదులయందు భోజనాదికముల విచారణాధికారిగ బహు సమర్ధతతో పని నడపువారు. అదివారి సొత్తు. ఆ విశాలమైన ముఖము, ఆ నామములు వీధి నిండుగ నడుచు ఆ విగ్రహము స్మరణకు వచ్చుచున్నవి. ఎంతటి చిరుతప్రాయులను కలిసికొని మాటలాడుచు మహాప్రీతిని ప్రకటించువారు. సంఘసంస్కార విరోధులు. శ్రీరామ ఉత్సవములు తమ యింట చాల విశేషముగ జరుపువారు. గోపుర శిఖరముల దింపి పునరుద్ధరింప పూనిరి. అంతలో దైవము తన సన్నిధికి ఆహ్వానించెను. వీరి పేరుగల వీరి పితామహులే నెల్లూరున శ్రీరంగనాథుని గోపుర నిర్మాణమునుగావించిన మహాధార్మికులు

ఉత్తమ వంశ లక్షణము నాటికి పోవునుః శాస్త్రిలవారికి ముఖ్య శిష్యుడు. వీరి కుమారుడు నై. వి. సుబ్రహ్మణ్యం వకీలై ఇచ్చట ప్రియమైన స్వగృహమున నున్నాడు. నాటకములలో వేషము వేయువారే, కుంభకర్ణాగా వీరు మంచి పేరు నార్జించినవారు. త్యాగరాయ సభలో చాల శ్రద్ధ వహించి యున్నారు.

## బేజాజ్ సొసైటి

ఇట్లు ఈ సంఘముల వారుండగా చెన్నపట్టణమున కళాశాలలో చదువుచుండిన ఆ వెనుకటి కారు విద్యార్థులు, నెల్లూరులో "బేజాజ్ సొసైటి" అను పేరుతో కూడి ఇంగ్లీషు నాటకముల నాడుచు పై పెద్ద సంఘముల వారికి తదితరులకు ఆహ్వానముల నంపి సర్కారధికార్లు, వకీళ్ళు వీరి ఆదరమును పొందుచు నుండెడివారు. కడపట చిత్రనళీయమును వ్రాత పోస్టాఫీసుకు ఎదుట స్థలములో పందిరిలో ప్రదర్శించిరి. అందు కందాడై మణవాళ నలుడై కేశవాచార్యులను జ్ఞాపకమునకు తెచ్చినాడని పేరు. వీరి యీ సంఘమునకు కీ॥ శే॥ దొరస్వామి అయ్యంగారు అధ్యక్షులుగా మొదట నుండిరి. పిమ్మట వీరే వారిని వదలుకొని శ్రీ మైదవోలు చెంగయ్య పంతులుగారిని అధ్యక్షులుగా వరించికొనిరి.

## ఏకీకరణోద్దేశ్యము

అమెట్యూర్ నాటక సభవారికి మొదట తాము వ్రా

రంభించిన పద్ధతినే నెల్లూరు నాటక కళ ఒకే సభాముఖమున వెల్లడియై ప్రజ్వలించునట్లు అన్ని సభలు ఒకటిగాచేరి పిరో ధములు లేక నెల్లూరుయొక్క భావి అభివృద్ధికి తోడుపడుటే సమంజసము కాగాయని అభిప్రాయము కలిగినవారై తమ అనేక సమావేశములలో ఆలోచించుకొని ఒక ప్రకటన గావించి అన్ని నాటక సమాజముల ఏకీకరణముకై ప్రయ త్నించి అన్ని సభలవారికిని వ్రాసిరి. ఈఏకీకరణోద్దేశములో ఏలనో ఆంధ్ర భాషాభిమాని సమాజమువారు కూడి రాక ప్రత్యేకముగా నిలిచిపోగా బెజాక్ సొసైటివారందరును తమ అంగీకారమును తెలిపి ఒక సమ్మేళనము జరిగి నెల్లూరు ప్రొగ్రె సివ్ యూనియన్ అను పేర నెల్లూరుయొక్క అభివృద్ధికి తోడు పడునట్టి సంఘముగా ఏర్పడి, నాటక ప్రదర్శనముతో ఏకైక లక్ష్యముగా కాక, నెల్లూరుకు పెద్ద విద్యావంతుల రావించుట విందులు జరిపి వారికి స్వాగత మిచ్చుట, ఉపన్యాసము లిప్పించుట, తమలో తామే ఉత్సాహమున సారస్వత సేవాభి నివేశముతో ఒక్కొక్కరు ఒక్కొక విషయమునై వ్యాసముల వ్రాసి కలెక్టరులు, జడ్జీలు తదితర గొప్పవారు వీరలను అధ్య క్షులుగా ఆహ్వానించి జరుపుకొనట, ఇట్లుగా ప్రారంభించిరి.

జిల్లాలోని వకీళ్ళు ఉద్యోగులు, కలెక్టరు ఆఫీసువారు, కోర్టువారు గొప్ప సర్కారధికార్లు అందరు ఈ సంఘ మునకు చెందిన వారుగా నుండవలయునని వారివారిని

గమించి తమ ఉద్యమమును తెలిపి చేర్చుకొనుచు జరుపుచుండిరి. ఈ యూనియనుకు అప్పటి ఏకీభ్యులో నాయక మణియై యుండిన కీ॥ శే॥ టి వి. వెంకటరామయ్యర్ గారు అధ్యక్షులుగను బెజవాడ సొసైటివారి అధ్యక్షులుగనుండిన ప్రతిభావంతులు కీ॥ శే॥ చెంగయ్య పంతులు గారు ఉపాధ్యాక్షులునునై ఏర్పడిరి. ఇట్లు చిన్నలు పెద్దలు కలిసిన ఈ యూనియను ద్విగుణోత్సాహముతో పనిచేయు సమయమట్టి, అందరి ఆదరాభిమానముల చూరగొను మొదలిడినది. ఇట్లు డ విశాలమైన పందిలి నిర్మించి అందు తే 7—7—1౫0 ని దిన చిత్రనళీయ నాటకము (ఆనాడు కీ॥ శే॥ కేశవాచార్యుల వారి నిర్వాణముతో మరల ప్రదర్శనకు నిలిపియుండిన దానిని) ప్రదర్శించిరి. యీ సభా సభ్యులలో అనేకులకు గురువుగారైన వెంకటగిరి రాజాగారి స్కూలు హెడ్మాస్టరుగానుండి అమెట్యూర్ నాటకసభా పోషకులుగా నుండిన కీ॥ శే॥ వేంకటరామానుజరావు నాయుడు గారి స్మారకము నేర్పాటు చేయుటకు సహాయార్థముగా నయ్యది ప్రదర్శింపబడెను. శ్రీమాడభూషి నరసింహాచార్యులు, బి, ఏ,, బి. యల్; టి. వి, రామస్వామిఅయ్యర్, బి. ఏ, బి.యల్, (ముద్దుకృష్ణ తమ్ముడు ముద్దుకృష్ణ అమెట్యూర్ నాటకసభకే కార్యదర్శి) సంయుక్త కార్యదర్శులుగా నుండిరి. ఈసమ్మేళిన సంఘము పుష్కలమైన నటబృందముతో తాండవమాడుచుండెను. అప్పుడు ఈ చిత్రనళీయ పునరుద్ధరణమునకు ఒద్దికలను సంతపేటలో ఇప్పుడు మిట్టదొడ్డి రామారావుగారి

ఇల్లుగా నుండు ఆ పెద్ద మిద్దె ఏర్పరచుకొని యుండిరి. అది అప్పటిలో శ్రీ వావిలకొలను సుబ్బరావుగారిదిగా నుండినది. (దీనికి ఎల్లప్పుడును అమెట్యూర్ నాటక సభయందు ప్రత్యేక అభిమానము.) మరచితిని యూనియను వారు తమ పందిలి వేయుటకు ముందె శ్రీ ఆంధ్రభాషాభిమాని సమాజము వారు సుబేదారు పేట రోమను కాథలిక్ చర్చికి ఎదురుగా పందిలి వేసియుండిరి నాటక సమాజముల ఏకీకరణమునకు వారు కలిసిరాకున్నను. "బాడుగ ఇచ్చునెడల తమ పందిలి మనకు ఆ నాటకము నాటికి ఒసగుదురేమో అడిగి తెలిసికొనిన వేరు పందిలి వేయు ఖర్చు మిగులునని" యోచించి సమాజము వారికి ఒక జాబు వ్రాయుటయు అది అప్పుడే తిరస్కరింపబడి వెనుకకు వచ్చుటయు అయినదనుమాట వినియే శ్రీ వెంకటరామయ్యర్ గారు "అది ఎంతసేపు" అని నలుగురు కక్షీదార్లకు చెప్పి మంచి పందిలిని ఈ సంతపేట వద్ద కట్టెంపూడి సుబ్బయ్య స్థలములో నెలకొల్పడము జరిగినది. ఈ చిత్రనళీయమున శ్రీ నేలటూరు సింగరాచార్యుల వారు నలుడు. మంచి విగ్రహము ఈ నాటకము చాల జయప్రదముగా నెరవేరినది ఆ దేమి చిత్రమో ఆ పైవారమున మరొక నాటకము ప్రదర్శింపబడ వలసినదిగా నుండగా ఈ పందిలి హఠాత్తుగా అగ్నికి ఆహుతియైనది. ఊరివారందరు ఆశ్చర్యపడి జాలితో చూడసాగిరి. శ్రీ వెంకట్రామయ్యర్

గారు వగైరా ప్లీడర్లు, శ్రీ సింగరాచార్యులు వగైరా నటులు అందరు వచ్చి భస్మీభూతమైన ఆ పందిరిని చూచి చాల వ్యాకుల పడిరి. నోటికొక మాట అయినది, ఈ వరకు అమెట్యూర్ నాటక సభా నాటకములన్ని పందిరి వేసికొనియే జరిగినవి. అట్లె ఆంధ్ర భాషాభిమాని సమాజము వారికిని. ఎంతకాలమో ఇట్లు జరిగిపోగా ఈ మారు ఇట్లు పరశురామ ప్రీతియగుట కలిగెను. అంతకు ముందు పందిరి వేసికొనుటకు ఉత్సహించి ఆంధ్ర భాషాభిమాని సమాజము వారిని అడిగి లేదనిపించుకొనుట యొకటి జరిగియుండినది. అందరు వేదాంతులే యుందురా? ఎవరీ నట సంఘముల సమ్మేళనము సర్వజనాదరణమును పొందియుండుటకు వగచి ఈ పని జరిపించిరో యని వదంతులు చెలరేగినవి. ఎంతకును "ఆశాభంగమే దుష్టచిత్తులకు శిక్షణ" యని పెద్దలనునట్లు "ఒక వేళ మూనియర్ వారు ఆవల ప్రదర్శింపవలసిన నాటకములను ప్రదర్శింపకుండ చేయవలెనని ఎవరేని అసూయా విఘ్నములు చేసి యుందురేమో అట్టివారికి ఎట్లయినను ఒకటి రెండు రోజులలో వేరు పందిరిని మరల నిర్మాణము చేసి మొదట జనమునకు తెలియజేసి యుండినట్లే నాటకము ఆడియే తీరితిమేని అదియే ఆ దుష్టచిత్తులకు చెంపపెట్టు" అని అట్లు పూనుకొని శ్రీ వెంకట్రామయ్యర్ గారు రెండు దినములలో వేరొక పందిరిని నెలకొల్పి మరల చిత్రనళీయమునే (1906 సం॥రం జులై తే 14 ది) ప్రద

ర్శించి ఆపైని క్రొత్తనాటకము చిరకారిని (1906 సం॥రం ఆగష్టు నెల తే 7 ది ప్రదర్శించి జరిపినారు శ్రీ రామానుజరావునాయుడుగారి స్మారకము మాత్రము మొక్కపోయినది వారిరూపపటము రాజాగారి స్కూలులో నున్నది. వారి పవిత్రనామముతో ప్రారంభమైన ఈ పని ఏలనో సరిగా రాకపోయినది. బెంచీలు కుర్చీలు, తెరలు అన్ని తెగులబడి పోయినవి. ఎవరెవరివద్దనో కొయ్యలు, సామాను తీరుగ యిచ్చునట్లు పెద్దమనుష్యులు తెచ్చుటయు ఆయిచ్చిన వారు గొడవించి యిచ్చుటయు జరిగియుండెను, వారందరికి ద్రవ్యముగా మరల సమకూర్చవలసి ఏర్పడి, నాటకముల వలన గడించిన ద్రవ్యము ఇతర కార్యములకు అందక కొంత కాలము జరిగినది.

బేజాక్ స్టాసైటివారుగానుండి యూనియన్ వారైన నటులలో ప్రముఖులను గురించి కొంత వివరింప తగియున్నది.

## శ్రీ కానుకొలను రామచంద్రరావుగారు

జిల్లా బోర్డు సెక్రెటరీగాను, నెల్లూరు మునిసిపల్ కమీషనర్గాను ఉండి ఈ రోజు రిటైరయి యున్నారు. వీరుమంచి విగ్రహము. చిన్నతనములో పాదుకా పట్టాభిషేకమున రాముని వేషము వేసినపుడు "అసలు రాముడు" దిగివచ్చినాడన్నట్లు రూప సంపద కలిగియుండి సుప్రసిద్ధ నటుడుగా కీర్తి వడసినాడు. ప్రప్రథమ చిత్రనళీయ నాటకమున సుదేవుడుగా

చాలా ప్రశంసనీయుడైనవాడు. ప్రమీలలో పారిజాతలో అర్జునుడు. సామాన్యముగా నాయకుని పాత్రను ధరించువాడై రమ్యముగ పద్యమును చదువుచు మెప్పువడసినవాడు. ఇప్పుడు ట్రంకురోడ్డులో ప్రత్యాహము వృద్ధుడయి అందరకు కన బడుచు తిరుగుచునే యున్నారు.

## శ్రీ సుంకు కృష్ణస్వామి శెట్టిగారు

ఆ దినములలో ప్ర ప్రథమ వీరనాయకుడు. అదే నాట కమునందుమన్మథ రూపుడై కామ దేవుడుగా ప్రవేశమైనాడు. మంచి బింబము. చిరకారియందు "కళానిధి" యై కళానిధిగానే యుండినాడు విశారదుడు పై రామచంద్రరావుకాగా జంట చాల బాగుండెడిది. కళానిధిగా ఉన్నతుడై కృష్ణస్వామి చేసిన నటనము మరపునకురాదు. బి ఏ., బి. యల్., అయి వకీలుగ నుండి టౌనుహాలుకు ప్రప్రథమ కార్యదర్శియై మదరాసు రాష్ట్రీయ కాన్ఫరెన్సుకు వాలెంటీర్ కెప్టనుగ నుండి అద్భుత ముగా ప్రజాసేవ చేసినవారు. నిగర్వ శిరోమణి. మునిసిపల్ వైస్ చేర్మెనుగ నుండినారు. హఠాత్సంభవమైన జబ్బుతో మర ణించినాడు. ఇతని జబ్బులో రాత్రి 1 గంట వరకు ఇతని యింటిలో ఇతనికి వైద్యము మాయింట నుండిన Oxypathor అను మిషనను కట్టి లోనికి oxygen పంపుటకై ప్రయత్నించి విఫలుడనై వచ్చినవాడను. మిత్రరత్నము. శ్రీ సుంకు చెంగల్వరాయ శెట్టి, వైశ్యాప్రెస్ శ్రీ శంకరనారాయణ గార్ల తండ్రిగారు.

## శ్రీ ముంగమూరు వెంకటసుబ్బారావుగారు

ఇప్పుడు అడ్వొకేటు. ప్రప్రథమ చిత్రనళీయమున దమయంతియై అంతఃపుర స్త్రీగా ఆసన్నని బురఖాతో మార్గమున చాల ప్రశంసనీయముగ ప్రదర్శించినాడు. నీకనాడుకొనియెదుట కతిఃము గామాటలాడ నలసివచ్చినపుడునుఅంతకుముందు ప్రాణదాతయను భక్తిని ప్రదర్శించినపుడు ముఖభావభేదమును చాల బాగుగ వెల్లడి చేసినవారు. (ఇప్పటి వారివలె సుఖమేమైనా గ్లాసు పెంకు మాదిరియుండి ఏడుపు రాగములతో పద్యములు మాత్రము చదువుట కాదు.) తుదిన "పాపంబునాయది ప్రాణేశ" అని ప్రవేశించినప్పటి ఆముఖము ఇంకను తలంపునకు వచ్చుచున్నది. కట్ల కడపట తమ గురువులగు వాఘిలికోలసుబ్బరావు పంతులుగారి సుభద్రా విజయమున అర్జునుడై కపట సన్యాసియై యుండి యున్నాడు. ప్రొగ్రెసివ్ యూనియన్‌లో 1917 లో కండక్టరు 1918, 1919 లలో కార్యదర్శిగా నుండియున్నారు.

## శ్రీ వవ్వేటి విశ్వనాధరావుగారు

వీరును అడ్వొకేటుగానున్నారు. కో-ఆపరేటివ్ బ్యాంకికేగాక ఇంకను అనేక పబ్లిక్ సంస్థలకు చెందినవారు. ప్రప్రథమ చిత్రనళీయమున వార్ష్ణేయుడు; ఆవల ప్రమీలలో ప్రద్యుమ్నుడు; పాదుకలో లక్ష్మణుడునైనవాడు ప్రొగ్రెసివ్

యూనియనుకు 1917 లోనే కార్యదర్శి అయినాడు. కార్య నిర్వాహకుడుగను గ్రహించి పనులు చేసినవారు. ఇప్పటి కిని శ్రద్ధా భక్తుల చూపువాడు.

## సయ్యద్ ఖాసింగారు

క్రమేపి పోలీసు డిప్టీ సూపరింటెండెంటు అయి చనిపోయినాడు. స్వచ్ఛమైన తెలుగు మాటలాడువాడు. ప్రతాపరుద్రీయములోని మహమ్మదీయ తెలుగు తమ్ముచాల అవమానించుచున్నాడను అభిప్రాయముకలవాడు. తెలుగు ఎలోకషనులో శ్రీ వెంకటరాయ శాస్త్రులవద్దనే ప్రథమబహుమతి పొందగలిగి పొందినవాడు. సుబుద్ధిగా వేషము వేసి ముఖమున తిలకము బొట్టుదిద్దికొని చాల బాగ నటించినాడు. ఆనలి రోజులలో ఉద్యోగము తీరుబాటిచ్చినదికాదు. రంగనాయకులపేట వాస్తవ్యుడు. మంచిరూపరి.

కందాడై మణవాళ్—కందాడై రంగస్వామి (డిప్టీ సూపరింటెండెంటు-పోలీసు) వీరిరువురు అన్నదమ్ములు అమెటూర్ వారి కార్యదర్శిగా నుండిన శఠగోప రామానుజాచార్యుల సహోదరులు. మంచి నటనాకౌశలము గలవారు. యరగుడిపాటి జానకిరామయ్య (పోలీసు యస్. ఐ) పత్రి నరసింహారావుగారు (హాస్యమున సమర్థుడు) ఇత్యాదులితరులు.

ప్రోగ్రెసివ్ యూనియనుంగో వెనుక
సభ్యులై నాటకములో పాల్గొనిన నట శేఖరులు.

## నేలటూరు వరదాచార్యులు

స్త్రీ పాత్ర ధరించువారు, అత్యద్భుతముగ పాట పాడువారు, చింతామణియందలి మోహినిగ మనోహరముగా పాడి తనియింపజేసినవాడు, సావిత్రిగాను, బృహన్నలలో ఉత్తరగాను, ప్రమీలలో మలయవతిగాను, పురుష వేషములో సారంగధరుడు, పారిజాతాపహరణములో శ్రీ కృష్ణుడు మాధుర్యమగు కంఠము - పాట, నటనా కౌశలము అంత కల దని చెప్పుటకు లేదు. అంత రూపరియు కాడు. గాని అతని పాటయే అన్ని లోపములను కప్పిపుచ్చునట్టిదై మంచి పేరు నార్జించినారు. జిల్లా కోర్టులో గుమాస్తాగా నుండినాడు.

## శ్రీ నందగిరి హనుమంతరావుగారు

అవనికి దిగిన అప్సరసవలె స్త్రీ వేషమున ప్రకాశించు వాడు. నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియనుకు చేరబడినాడు. 1910, 1914 సంవత్సరములో స్టేజిడైరెక్టరైనాడు. కైకేయిగా పాదుకా పట్టాభిషేకమున, ఉలూపిగా సుభద్రా విజయమున, ప్రమీలా రాణిగా ప్రమీలలో, శాస్త్రిలవారి సమాజమున శకుంతల ఉష యిత్యాదులు నటించినవారు. బృహన్నలలో ధర్మరాజుగా కంకుభట్టుయి యుండినాడు. మంచి నటుడూ, ఇప్పుడు వృద్ధుడై సజీవుడై యున్నాడు. ఈయన రాజాగారి

స్కూలులో ఉపాధ్యాయులుగ నుండినవారు. ఇప్పుడును విద్యార్థులకు చదువు చెప్పుచు తన బసవద్ద విద్యార్థులను చేర్చుకొని యున్నాడు. మంచి ఉత్సాహి. సంఘసేవ వీరికి పరిమ ఇష్టము ఇంగ్లీషులో అద్భుతమైన కవనము చెప్పువాడు. గాంధి జవహారిలాల్ ఠాగూరుగార్ల మీద వ్రాసియున్నారు.

## కీ॥ శే॥ నెల్లూరు నాగరాజారావు

ప్రోగ్రెసివ్ యూనియన్ వారు అభిజ్ఞాన మణిమంత నాటకమును వేయబూని ఒద్దికలు జరుపునపుడు సభ్యుడై ఒక చిన్న వేషము "పూజారి" తీసికొని దినముఒద్దికలవద్దకు వచ్చుచుండినాడు. అప్పుడు ఆ నాటకము ఇక్కడ ప్రదర్శింపబడలేదు. అంతలో తనతో సమవయస్కులగు జ్ఞానోదయము వారికి చెందియుండినాడు. తర్వాత ప్రఖ్యాత నటుడై ప్రోగ్రెసివ్ యూనియన్‌కు 1918 లో కండక్టరుగా నుండియున్నాడు తాను గొనిన పాత్రను ఎంతవేని జయప్రదముగా నిర్వహించెడివాడు. కళాపోషణమున దిట్ట. నెల్లూరు విషయమై సవతి తల్లి ప్రేమగల ఉత్తరాంధ్రులుకూడ ఇతని నటనమునకు దిగ్భ్రమజెంది "రంగోద్ధారక" బిరుదమును ప్రసాదింపవలసి వచ్చినంతటి సామర్థ్య విరాజితుడు.

## యస్. వి. కృష్ణమాచారి

1913 లో యూనియన్‌లో సభ్యుడయినాడు. యూని

యుర్ కట్టకడపటి నాటకములలో పారిజాతాపహరణమున రమణీక వేషము ఇష్టపడి నటించినాడు. బాగా పాడెడివాడు. ఇంతలో చదువుకై గుంటూరులో నుండవలసినవాడై బలిజే పల్లి లక్ష్మీకాంతంగారి హరిశ్చంద్రను అక్కడ ప్రదర్శింపగా చూచి దానిని బాగా వల్లించుకొని హరిశ్చంద్ర వేషము ను ఇతర సభలలో వేసి అందు ఒకగొప్ప పేరు నార్జించి కమ్మట అన్ని నాటకములలో నాయక పాత్రను ధరించుచు ఎక్కడ వుండినను అక్కడ కొందరు చేర్చుకొని కళను వృద్ధిచేయుచు రాజమండ్రిలో ఒక ఫిల్ములో రామదాసుగా నటించినాడు. మంచి కంఠము. బాగా పాడగలిగినవాడు. కౌశలము గల వాడు. ఇప్పుడును నాటకపిచ్చి వదలలేదు. తిరువళ్ళూరులో స్కూలు మాస్టరుగా ఉండియున్నాడు.

ఇంకను అనేకులు మిత్రులు నేలటూరు వెంకటరామా చార్యులు స్టోర్ హాపుసుపేట (దుర్యోధనుడు) ఇతని తమ్ముడు నేలటూరు సుందరరాజం (నారదుడు) అద్భుతమైన పాటకుడు పులిగండ్ల రంగయ్య (మందర వేషధారి) ముత్తరాజు శీనా మయ్య యూనియన్ కార్యదర్శి మంచి విగ్రహము మూగ నాటకము Tableuxలో దుష్యంతుడు ఇత్యాది పాత్రములను ఎత్తినవాడు పిస్సారాజగోపాలరావు (పాదుకలో లక్ష్మణుడు గా సారంగధరలో ప్లీడరుగా ఇన్నెల్ల నుండువాడు. యెరగుడి పాటి గోపాలకృష్ణయ్య (మునిసిపల్ మేనేజరు— మునిసిపల్

ఎంప్లాయిస్ అసోసియేషన్‌లో హరిశ్చంద్రుడు ఇత్యాది ముఖ్యపాత్రధారి) తూములూరు కృష్ణయ్య సబ్ మేజిస్ట్రేటు ఆఫీసు (హాస్యవేషధారి) గుంటూరు శివకామయ్య సమాజము వారి చిత్రరేఖ, శంఖచూడుడు అద్భుతముగా పాడువాడు. యూనియన్ సభ్యుడై నాను నాటకముల కండక్టరుగ కూడ ఉండినాడు. గాడేపల్లి శేషయ్య ప్లీడరు- సుభద్రగా శ్లాఘనీయముగ నటించినవాడు. బండేపల్లి అనంతాచార్యులు రంగనాయకులపేట (స్టేజి ఫిట్టర్.) కాసుఖేల శంకరరావు పోలీసు ఇన్‌స్పెక్టరు- పింఛన్- చిల్లర వేషధారి. నేలటూరు రామానుజాచార్యులవారు వకీలు- పఠీఖాన్ పాత్ర నిర్వహణ దక్షుడని పేరుగన్నవాడు, సమాజము వదలి యూనియన్ సభ్యుడై 1919లో కండక్టరు హోదాయందుండి యున్నారు.

## బాలాంధ్ర భాషాభిమాని సమాజము

ఈ పెద్దవారి సంస్థలు ఇట్లుండగా రంగనాయకులపేటలో చిన్న జట్టుగా చాల ముందునుంచి Young mens's Association అను పేరుతో విద్యార్థులు మీటింగులు పెట్టుకుంటూ ఇంగ్లీషులో వ్యాసములు వ్రాసి చదువుచు నుండి తిరునాళ్ళలో రంగనాయకుల పేట తురక సందులో గరుడసేవ నాడు ఏదేని నాటకము ప్రదర్శించుచునుండిరి. వీరు కొంత పెద్దవారై "బాలాంధ్ర భాషాభిమాని సమాజము" అను సంఘము నెలకొల్పిరి. ఇందలి ముఖ్యులు, సరస్వతి రంగస్వామి అయ్యంగార్, నడాదూరు సింగరాచార్యులు, వావిలికొలను

రంగారావు, కొలిపాకం వెంకటవరదరావు, వెలిదొండి వరద రావు, నాగరాజు సీతాపతిరావు. నేలటూరు (పెద్ద) రామ దాసయ్యంగార్, కె సుందరరాజన్ (దొరసామిఅయ్యంగార్ మేనల్లుడు) కొమ్మండూరు కృష్ణస్వామి అయ్యంగార్ (పోలీసు ఆఫీసు) వెంకటేశ పెరుమాళ్ (సంతపేట) వీరందరుండిరి.

ఆంధ్ర భాషాభిమాని సమాజము వారు ముందు చిన్న ఆడ వేషము నిచ్చిగాని ఎవరికిని తమలో ఎక్కువ ప్రవేశము కలిగించుటలేదు. రావిప్రోలు సుబ్రహ్మణ్యం గారిని మొదట వేత్రవతిగానో, అనసూయ ప్రియంవదలలో నొకరి గనో శాకుంతలమున చొప్పించిరి. అట్లే సరస్వతి రంగసామిని మొదట నాగానందములో గౌరి వేషము నిచ్చి ప్రవేశము కలిగించిరి. ఇట్లే నేలటూరు వెంకటరామాచార్యులు .[స్టోన్ హౌస్ పేట] కు ప్రియదర్శికలో సాంకృత్యాయని వేషము నిచ్చి చేర్చుకొనిరి. ఎట్లయినను ఈ చిన్నవారి కందరకు వారు వారు సొంతముగ తము తోడి ఈడు వారితో కలిసి మెలసి యుండు ఆనందము అట్టి పెద్దవారి మధ్య అనుభవించుట కష్టమే యగును గాన ఈ బాలాంధ్ర భాషాభిమాని వారు తమంతట ప్రత్యేకముగానే శాస్త్రీ నాటకములాడి ప్రసిద్ధులై క్రమేణ పెద్ద సమాజమువారిని మించినవారై వారిలో కలిసి పోయిరి. ఇట్లు ఈ చిన్నవారందరితో కలిసిపోవుట పెద్ద వరుస వారికి కొందరికే సంపడక పోగా సమాజము వారిలో

వై మనస్యములు ఏర్పడి కొందరు పెద్దలు సమాజమును వదలు కొనిరి. ఇందలి ముఖ్య నటులు;—

## సరస్వతి రంగస్వామి అయ్యంగార్

వీరును శాస్త్రిగారి నాటకములకనే ప్రత్యేకించి తన్ను తాను కట్టిపెట్టుకొనక ఇతరచోట్ల అరవ తెలుగు నాటకములలో శ్రీదొరస్వామి అయ్యంగారుతో కలిసి వేషధారణముచేసి కడకు నేడుగా "బెంగుళూరు అమెట్యూర్ నాటక సభను" చెంది, శ్రీ బళ్ళారి టి. రాఘవాచార్యులవారికి చేదోడు వాదోడునై నటనా కౌశలమున మహా ప్రఖ్యాతి నార్జించు కొనినవాడై, ఎట్టి పాత్రనైనను సమర్థతతో నిర్వహించు సర్వంకష శక్తిని గలిగి, ఈనాడు సినిమా ప్రపంచమునకును చెందియున్నాడు. రంగస్వామి స్త్రీ పాత్రధారిగా శకుంతల-ఉష-బొబ్బిలిలో వెంకటలక్ష్మి, మల్లమదేవి ఇత్యాది నటించినది మరపునకు రాదు. యుంగధరుడుగా-కణ్వుడుగా-జీమూతవాహనుడుగా, ఉత్తరరామ చరిత్రన రాముడుగను కొన్నిట హాస్య వేషధారిగను నటించి అద్వితీయ ప్రతిభను చూపినవాడు. నెల్లూరు నాటక రచయిత శ్రీముత్తరాజు సుబ్బరావుగారి మౌర్యాభ్యుదయమున చంద్రగుప్తుడై కీర్తిగాంచినాడు. కళాపోషణము ఇతని సొత్తు. ఇట్లు అన్నిటను ఔచితి నెరిగి అతడు నటించినది ఇటీవలివారుకూడ మరచి యుండజాలరు. బహు చమత్కారి. వేడుకకాడు- రసజ్ఞుడు- శాశ్వత కీర్తిని

గడించినవాడు. ఇంతలో స్త్రీ వేషములు స్త్రీలే వేయవలెనని నెగడుట ఏర్పడినది. నాటకము లాడుటలో గొప్పవారును స్త్రీలతో కలిసిమెలసి ఆడుట గౌరవమైన వృత్తిగా నేగ్రహింప సాగిరి.

శ్రీ కనుపర్తి వెంకటసుబ్రహ్మణ్యము యుగంధరుడుగా, తాండ్రపాపారాయుడుగా మరిఇతర వేషములయందు బాగుగ ప్రకాశించినవాడు.

యరగుడిపాటి హనుమంతరావు చిన్నవాడు శాకుంతలములో భరతుడు పిమ్మట శ్రీ టి. రాఘవచార్యుల వారికి సహవాసియై పఠాణ్ రుస్తుం ఇత్యాది నిర్వహించువాడై, కుంభరాణాగా ప్రస్తుతి కెక్కినాడు. మొన్నమొన్న యుగంధరుడుగా ప్రశంసనీయముగ నిర్వహించినది చూచితిమి. పిచ్చివాని భాగమున లోపము గ్రంథ లోపమే. వారిది కాదు.

## జ్ఞానోదయ సమాజము- నెల్లూరు.

ప్రోగ్రెసివ్ యూనియన్‌లో సభ్యత్వము సులభముగాక యుండుటవలన, నాటకముల నాడుటలోనే బుద్ధి లీనమై తదేక ధ్యానముతో వేడుకగా కాలముగడుపుగోరు వారందరు (ఆంధ్ర భాషాభిమానుల ఆ నాలుగు నాటకములకే కట్టుబడు ఉద్దేశ్యములేక) వేరు వేరుగా కూడుటయు ఆలోచించుటయు నై "జ్ఞానోదయ సమాజము" అనుఒక సంఘముగా ఏర్పడిరి.

ప్రొగెసివ్ యూనియన్ సభ్యులనే పెద్దవారిని అధ్యక్షులుగా ఏర్పాటు చేసికొని నాటకమునాడుట ప్రారంభించిరి. వీరికి ప్రోత్సాహము బాగాయుండెడిది. కీ॥ శే॥ కాకుటూరు వెంకట్రామయ్యగారు, బి.ఏ., బి.యల్., అధ్యక్షులు. ముత్త రాజు సుబ్బరావుగారు, యం. ఏ., ఉపాధ్యక్షులు. నటనా కౌశలము చిన్న చిన్న వారియందుండి, పెద్దవారిచే ఉదార మనస్కతతో ఆదరింపబడక దాగియుండినది, ప్రదర్శింపబడ జొచ్చినది. ఇందలి ముఖ్యనటులు:—

## శ్రీ రావిప్రోలు సుబ్రహ్మణ్యంగారు

వీరు బళ్ళారికి పోయి అచ్చట శ్రీ ధర్మవరము రామ కృష్ణమాచార్యులవారి సరస వినోదిని సభకు చెంది వేష ధారణములు చేసి ఆవల గొప్ప నటుడై చిత్తూరులో నాటక ప్రదర్శనోత్సుకత గొలిపి ఉపాధ్యాయుడై అందరకు నేర్ప గలిగినవాడై నెగడి, గొప్ప సంగీత పాటకుడును హరికథా కాలక్షేపముల చెప్పు భాగవతరును అయి, సినిమా నటుడగు చిత్తూరు నాగయ్య- మదరాసు కౌన్సిల్ అధ్యక్షుడు రామ కృష్ణరాజు- వీరలకు నాటకకళను బోధించి, వారందరిచే గురు వుగా నెన్నబడి, ఇటీవలెనే దివంగతులైనారు. వీరు ఈ జ్ఞానో దయ సమాజమునకును ఆంధ్ర విజ్ఞాన సభకును చెందిన ముఖ్యపాత్రధారి. నల బాహుక పాత్రలను అసమాన ప్రజ్ఞతో నిర్వహించువాడు. పద్య పఠనమున దిట్ట.

## శ్రీ కందాళ్ళ శ్రీనివాసాచార్యులు

ఇతడు ప్రఖ్యాతమైన స్త్రీ పాత్రధారియై తనకు సాటి లేరని అనిపించుకొనినవాడు. ఇతని అన్నగారైన నారాయణాచార్యులు ఇతనిని తనవలె ప్రోగ్రెసివ్ యూనియన్ లో మెలగునట్లు ఏర్పరుపవలెనని, అచ్చటి పెద్దల సహాయము అతని ప్రరోవృద్ధికి మార్గము కల్పించునని, విశ్వప్రయత్నము చేసి ఇతనిని తెచ్చి యూనియన్ లో చేర్చినాడు. కాని ఇతడు అక్కడ దినము ఒద్దికలకు వచ్చినపుడు స్కూలులో తన ఉపాధ్యాయులైన సింగరాచార్యులు ప్రభృతులను చూచి క్షీగా వుండలేక, బడి పిల్లవాడై చొక్కా టోపితో నిలుచుకొని పాఠము ఒప్పజెప్ప ప్రారంభించి, ఎంత కూర్చుండమన్నను కూర్చొనక భయపడువాడై వెడలిపోయినాడు పాపము.

ఇతడు సమగ్రమైన నటనా కౌశలము గలవాడు. దివ్యరూపము, అద్భుతమైన పాట, ఆ కంఠ మాధుర్యము, అన్నియు ఏకాగ్రతతో ఇతని వరించినవి. నెల్లూరు ప్రతిష్టా గౌరవముల నెంతేనియు కాపాడినవాడు. అప్రతిమానుడు. అన్ని నాటకములలోను నాయికా పాత్రను ధరించి ఎంతేనియు పోషించి మెరుగు పెట్టినవాడు. జ్ఞానోదయ సమాజము, ఆంధ్ర విజ్ఞాన సభ వీనియందు ఎక్కువగా ప్రవేశము కలిగి యుండినాడు. చిరుత వయస్సుననే దివంగతుడైనాడు.

## మా గండ భేరుండా చార్యుడు

మా అనగా ప్రొగ్రెసివ్ యూనియన్ వారి అని అర్థము వీరే శ్రీ కాశీ చెంచుసుబ్రహ్మణ్యం గారు. ప్రఖ్యాత నటులు కళా పోషణమునకు ఎంతయు దోహదము కలిగించువాడు. జ్ఞానోదయ సమాజ స్థాపనాచార్యుడు. ఇప్పుడు సినిమా నటుడు. నాటకములందును ఉత్తమ పాత్రధారి. ఉత్తర సర్కార్ల జిల్లాల వారిచే ఆహ్వానింపబడి నటించుచు, ఆంధ్ర దేశమంతటను గొప్ప విఖ్యాతికి వచ్చియుండు వారు. ప్రతాప రుద్రీయమున చెకుముకిని అత్యంతము పోషించి నటించినాడు. "గండ భేరుండా చార్యుడై" ప్రొగ్రెసివ్ యూనియన్‌నందు వరలినాడు. నాటక కళకై నెల్లూరున అత్యంతము పాటు పడువాడు. నెల్లూరు కీర్తి నలుప్రక్కల నెగడవలయు నను వాడు. ఈయనయు తూములూరు శివరామయ్య (అనార్కలి ప్రియుడు) తూములూరు ఆదినారాయణయ్య (సక్కుబాయి పెనిమిటియై తల్లి వెనుక చేరి భార్యను తూలనాడుటను బహు చమత్కారముగా జరిపి విశేషముగా నవ్వించినవాడు) తూములూరు సుబ్రహ్మణ్యం సెకండరీ స్కూళ్ళలో అయ్యవారు (ఇంద్రుడు) తూములూరు వెంకటేశ్వర్లు (టీచరు) వీరందరు నాటకములలో వేషము వేయువారే తూములూరు శివరామయ్యగారి బంధువులు. శ్రీ నేలనూతల రామకృష్ణయ్యగారు నారదుడుగా అవనికి అప్పుడే దిగిన త్రిలోక సంచారియై భగవద్భక్తి ఉట్టిపడునట్లు అద్భుతముగ పాడుచు నెగడినవాడు.

ఇట్లు పని చేయుచుండిన జ్ఞానోదయ సమాజమున చీలిక యేర్పడి కొందరు వేరుపోయి "ఆంధ్ర విజ్ఞాన సభ" యను నూతన పేరుతో వెలువడిరి. వీరు పిమ్మట తమ కధ్యక్షులుగా ప్రొగ్రెసివ్ యూనియన్ కార్యదర్శియైన శ్రీ మాడభూషి నరసింహాచార్యుల వారిని ఉపాధ్యక్షులుగా ప్రొగ్రెసివ్ యూనియన్ కండక్టరైన శ్రీ తూములూరి శివరామయ్యగారిని ఏర్పరుచుకొని పని చేయుచుండిరి. ఆంధ్ర విజ్ఞాన సభ మంచి నట బృందముతో సమకట్టి వెడలినది. కాగా జ్ఞానోదయ సమాజము విశేష కార్యకలాపము లేనిదై యుండ కొంత కాలమునకు మరల ఈ చిన్ని చీలిక సంఘములు రెండును కలిసిన బాగుండునని సమ్మేళనము జరిగి "సుజన వినోదిని" అను పేర ఒక సభగా ఏర్పడుటయు అందు శ్రీ శివరామయ్య గారు ఎక్కువ శ్రద్ధతో పని చేయుచు నాటకముల వేయించుచు ముఖ్యులుగా నుండిరి. ఈ సభవారు 1917 లో నెల్లూరులో (Andhra Conference) ఆంధ్ర మహాజన సభ జరిగినపుడు మంచి నాటకములు నాల్గింటిని ప్రదర్శించి పేరు గాంచిరి. పిమ్మట కారణాంతరముల చేత అదియు మారి. ఇప్పుడుండు "ఆంధ్ర సభ" ఏర్పడినది. వారి ప్రార్థనపై మరల శ్రీ శివ రామయ్యగారు దానికిని అధ్యక్షులైరి. ప్రొగ్రెసివ్ యూనియన్ లో తిక్కన గ్రంథ భాండారికుడును హోదాతో నుండిన శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యం శర్మగారిని ఉపాధ్యక్షులుగను ఏర్ప

రచికొనిరి. కోర్టుకు చేరుచు వచ్చిన చిన్న వకీళ్ళను అందరును అందు సభ్యులుగా చేర్చుచు అది ప్రొగ్రెసివ్ యూనియనునకు ఉద్దిగా నుండునట్లు ప్రయత్నములు జరిగినవి. శ్రీ శివరామయ్య గారు సొంత ద్రవ్యమును ఎంతయేనియు వెచ్చించి యైనను సభకు తోడ్పడుచు అవసరమైన తరుణముల వేషాధారుల కష్టములకు (నోటిమాటలతో జాలి వెలిబుచ్చుట గాక) ద్రవ్య సహాయముతో ఆదుకొనుచు మిత్రుడు శ్రీ చిపురుపల్లి మాలెకొండయ్య ఆరోజులలో ఒకప్పుడన్నట్లు "నెల్లూరు భోజరాజు"గా నేర్పడి తనసొంత సంస్థగా దానికై పాటుపడుచు, కలెక్టరాఫీసు కెదురుగా ఒక ఇల్లుకొని "తిలక్ పుస్తక భాండాగారము" అని యొకటి నెలకొల్పించి జరుపుచుండిరి. వీరు ఏ కారణముననో ఈనాడు ఆ సభా సభ్యత్వమునే వీడి అందు తను అభిమానము మాత్రము వీడజాలక ద్రవ్యము మాత్రము ఆద్భవన నిర్మాణమునకును, ఇతర కార్యములకును నొసగుచు తృప్తి పడియుండుట, వీరు అందు తెచ్చి చేర్చిన సభ్యులకును తది తరులగు మాయట్టి వారికిని తెలిసియేయున్నది.

ఇట్లు చిన్ని చిన్ని సంఘముల వారి నాటక ప్రదర్శనములు జరుగుచుండుటయు యూనియన్ పెద్దవారే ఆ సంఘములకు అధ్యక్ష ఉపాధ్యక్షులుగ నుండుటయు ఏర్పడుటలో, యూనియన్ వారు తమ సొంత నాటక ప్రదర్శనములు చేయుటను ఆపుదల చేయ నెంచుచుండిరి. అంతలో సభ్యులగు పెద్దలు

కొందరు నాటకములలో వేషము వేయగలిగిన సామర్థ్యము కలవారయ్యును అదేమోతమ్మును తాము కొంతతగ్గించుకొన్నవారముగా ఏర్పడుదుమని కొందరు వేషములు వేయకూడదనియున్నట్లు వార్త కలిగి, అది కారణముగా, అనుకున్న ప్రకారము నాటకములాడుట జరుగుట లేక నిలిచిపోజొచ్చినది. ఇచ్చట నాటకములాడుట సున్నయగుచున్నదనియే కాబోలు విసికి,నాటక ప్రదర్శనముల నెడ పక్షపాతముగల శివరామయ్యగారు ఆ చిన్ని సంఘముల నుద్ధరింప జొచ్చుకొనిరి. కాని యూనియన్ ఏకీకరణోద్దేశ్యమునకు భంగకరమై, విడి విడి సంఘముల ప్రోత్సహల పరచి పెంచడముగ నేర్పడుచుండుట వారు గమనింపకున్నారని యూనియన్ వారిలో కొంత కలకలము ఉండెడిది.

ఇచ్చట మరొక విషయము చెప్పతగినది కలదు కీ॥ శే॥ ధర్మవరము రామకృష్ణమాచార్యులు తమ నాటక ఉపోద్ఘాతమున వ్రాసినట్లు, నటులుగా వేషము వేయుట ఒక తగ్గుదల సూచముగా ఉండిన దినములున్నవి. ఆకట్టుకు సంబంధించిన వారు కొందరుందురు. కందాడై కేశవాచార్యులు దశరథుని వేషము వేసి రంగమున చనిపోవువాడై ఆభాగము జరుగునపుడు, వారి తండ్రిగారు నాటకమునకు వచ్చియుండి చూచి (వారి కిష్టములేదు అసలు వేషధారణమే) అందుకై వారికి తెలియకనే మదరాసునుంచి వచ్చి వెంకటాచలంలో

దిగి ఆట పందిలికి వచ్చియున్నారు కేశవాచార్యులు) చాల కోపించి చింతతో వెడలి పోయినారని తెలిసి యున్నది.

శ్రీ శివరామయ్యగారు విడిచిన పిమ్మట ఆంధ్రసభాధ్యక్షత శ్రీ ముంగుమూరు వేంకటసుబ్బారావు (అడ్వకేటు) గారిని వరించినది. వీరు ప్రాగ్రెసివ్ యూనియన్ స్థాపక బృందములోని వారు. వీరి నటనాకౌశలమును 66వ పేజీలో ప్రస్తావించి యున్నాను. స్వయము నటులగుట అనుభవముతో నట సభ్యులకు మంచి పద్ధతిని బోధచేసి చక్కదిద్ది సభవారికి ప్రీతి పాత్రులైరి. వీరి అధ్యక్షతలోనే ఆంధ్ర సభవారు విశేషించి విరాళమును ప్రోగుచేసి నూతన నిజ భవన నిర్మాణమును చేసికొనినవారైరి. వీరు వైదిక పరత్వ బుద్ధి కలిగిన వారై సకల సమ్మేళన సర్వజన సమైక్యతా భోజనాదికములను ఏవగించుకొనువారై భగవద్భక్తులై, లలితోపాసకులై యుండువారు. ఇది కీ॥ శే॥ జనమంచి శేషాద్రిశర్మ ఇత్యాది ఘనులకు వీరి యింట ఆతిథ్యమును సముపార్జించినదైనది.

కీ॥ శే॥ ఆమంచర్ల సుబ్బుకృష్ణరావుగారి యెడ వీరికి గురుత్వతాభక్తి మెండు. టౌన్ హాలున నుంపబడియుండు వారి రూప పటమును వీరేసిద్ధముచేయించి సమర్పించి యున్నారు. వీరు పండితజన పక్షపాతులు. ఇట్లుండియు హిందు మహమ్మదీయ స్నేహమును యెక్కువగా పాటించువారు.

ఉపాధ్యక్షులై అనేక వత్సరములుగనుండు "సాహిత్య

స్థాపకు"లగు శ్రీ దుర్భా శర్మగారు తన పండితోపన్యాసకత్వము, ఆంధ్రసభయందును సార్థకపరచుచు నట సభ్యులకు పద్యములందు సంగీతమున కన్నను సాహిత్యమునకే ఎక్కువ ప్రాధాన్య మిచ్చునటుల అర్థ గాంభీర్యమును వివరించి బోధించ వలసిన చోట్ల రమ్యముగ నూతన పద్యముల రచించి యిచ్చి చక్కచేసిడి కీర్తిని బడసినవారు. ఆంధ్రసభవారును నాటక ప్రదర్శనములయందే గాక సారస్వత సేవయందు శ్రద్ధాళువులై సారస్వత సప్తాహములను జరిపి వెలియూరివారిని రావించి మహోపన్యాసముల నిచ్చునటుల ఏర్పరచు ప్రోత్సాహము నెంతయేనియు ఒసగెడివారు.

శ్రీ జంగా వెంకయ్యగారు ప్రఖ్యాత నటులు స్మరణకు వచ్చుచున్నారు. ద్రౌపదీ వస్త్రాపహరణమున విదురుడుగ యెంతేనియు మెచ్చుగ నటించిన మేధావి. ఆవల చిత్తూరునకు చెంది శ్రీ "రావిప్రోలు" వారిని కలిసి అనేక స్త్రీ పురుష వేషధారణముల చేసి మెప్పు వడసిన వారు

యూనియక్ వారు నవరాత్రులలో కూడుచు ఏ వేని రంగముల ప్రదర్శించుకొనుచు మూగనాటకములTableuxల ప్రదర్శించి వినోదించుచుండిరి.

యూనియక్ వారి నాటకముల పట్టిక.

| | | |
|---|---|---|
| 7-7-1906 | ... | చిత్రనళీయము. |
| 14-7-1906 | ... | డిటో పురగు |

| | | |
|---|---|---|
| 3- 8-1906 | ... | చిరకారి |
| 1- 2-1908 | ... | శకుంతల [టూర్లో] |
| 4- 7-1908 | ... | చిరకారి |
| 1- 9-1908 | ... | బృహన్నల |
| 11- 4-1909 | ... | ప్రహ్లాద |
| 29- 5-1909 | ... | పాదుకా పట్టాభిషేకము |
| 5- 6-1909 | ... | చిత్రనళీయము |
| 12- 6-1909 | ... | చిరకారి |
| 4- 7-1909 | ... | పాదుకా పట్టాభిషేకము |
| 20-11-1909 | ... | విషాద సారంగధర |
| 22-10-1910 | ... | సావిత్రి చిత్రాశ్వము |
| 10-12-1911 | ... | ప్రమీలార్జునీయము |
| 2- 6-1912 | ... | సుభద్రా విజయము |
| 20- 6-1913 | ... | పారిజాతాపహరణము |

(చిలకమర్తి గారిది)

నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్ వారు వార్తా ప్రతికలను ఎల్లరు చదివి ప్రపంచ జ్ఞానమును పొందవలయుట ఎంతేని అవసరమని గ్రహించి అట్లు జనులను విద్యావంతుల గావించుటకై "ధర్మ పఠన మందిరము"ను నెలకొల్పి ఉచితముగా బాలురు వృద్ధులు స్త్రీలు అందరును చదివికొనునట్లు ఏర్పాటుచేసిరి. గూడూరు తాలూకా కోట కాపురస్థులు పెల్లేటి పెంచలు రెడ్డిగారు కొంత విశేష సహాయము నొసంగువారైనందున ఆ ధర్మపఠన మందిరమును వారి మామగారైన కీ॥ శే॥ నల్లపరెడ్డి సుబ్బారెడ్డిగారి పేర స్మారక చిహ్నముగా

వారి ఇంటనే నుంచి యూనియన్ వారు నిర్వహించు చుండిరి. ఇంతలో ఒక పుస్తక భాండాగారము తిక్కన సోమయాజి గారి పేర నెలకొల్పవలసినదిగా ఒకరు సలహా నిచ్చుచు వ్రాసిరి. ఆ జాబుపై చర్చించుకొని అప్పటిలో పఠన మందిర పోషణమునకే ద్రవ్య వసతి బాగా ఏర్పడి యుండలేదని పుస్తక భాండాగారమునకై వెచ్చింప నసాధ్యమగునని తలంచి కార్యనిర్వర్గమువారు సామాన్య సభా సమావేశమునకు ఆ విషయమైన తీర్పును వదలిరి. ఆ సామాన్య సభయు జరిగినది. "ధన వ్యయ ముండపనిలేదు. విద్యావంతులయొద్ద గ్రంథములు సేకరించి ప్రారంభించవచ్చును" అని తొలుత సలహానిచ్చినవారు చెప్పికొనిరి. ఆ సభలలో అందు విషయమై చేయబడిన ఆ తీర్మానములు ఇందు పొందుపరుపబడుచున్నవి.

"Proceedings of a meeting of the Executive Committe of the Nellore Progressive Union held on 14th October 1910 with Mr. A. S. Krishna Row in the chair.

Resolution No. 8:—Read letter dated 10th October 1910 *from Mr. K. Parthasaradhi Iyyangar* regarding the formation of a Telugu Library in Thikkana's name.

Resolved that the Executive Committee do recommend the subject to the General Body for consideration and acceptance.

NELLORE.
14th October 1910,

(Sd.) A. S. Krishna **Row**,
Chairman.

ఈ పై తీర్మానము జరిగిన నాడు మీటింగులో నుండిన కమిటీ సభ్యులగు వారందరికిగాను శ్రీ ఆర్. సుబ్బయ్యనాయుడు గారొక్కరు ఇప్పుడును ఉన్నారు. (మదరాసులో)

Proceedings of a meeting of General Body of the Nellore Progressive Union held on 29th December 1910 with Mr. O. Venkatarangaiah Pantulu Garu in the chair.

Resolution No. 1

“తిక్కన పుస్తక భాండాగారము”ను పేర నొక పుస్తక భాండాగారమును ప్రొగ్రెసివ్ యూనియన్ రీడింగు రూముకు అనుబంధముగ చేర్చి దీనిని అవిచ్ఛిన్నముగ జరుపుచుండవలెను.’

Carried unanimously.

Nellore,
30th December 1910 } (Sd) O. Venkatarangaiah,
Chairman.

ఈ సభలో నుండిన సభ్యులలో అనేకులు ఈనాడు లేరు శ్రీ ముంగమూరు వెంకటసుబ్బరావు, కానుకోల రామచంద్రరావు, దుర్భా రామయ్యగార్లు ఇప్పుడును ఉన్నారు. శ్రీ వెంకటరంగయ్యగారు (అధ్యక్షులు) మొనమొన్నటి వరకును ఉండియున్నారు. భాండాగారము ప్రతిష్ఠింపబడినది. ప్ర ప్రథమమున మా ప్రార్థనపై నెల్లూరు వారును ధర్మపరులను నగు శ్రీ. కే. యస్. కేసరిగారు ఒక బీరువను ధర్మముగా చేయించి యిచ్చిరి. యేలూరులో డిప్టి కలెక్టరుగా నుండిన

కీ॥ శే॥ శఠగోప రామానుజాచార్యులవారు అచ్చట రామా అంజు కో వారివద్ద అనేక గ్రంథములను సేకరించి పెట్టెలలో నింపి పంపిరి. శ్రీ శివరామయ్యగారు అనేక గ్రంథముల నొసగిరి. శ్రీ వేదము వెంకటరాయ శాస్త్రిలవారిని నేనై పోయి ప్రార్థింపగా వారు తమ గ్రంథములన్నింటిని సుమారు 75 గ్రంథములను దయచేసిరి. నెల్లూరు వారైన శ్రీ వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రిగారును కే. ఏ. వీరరాఘవాచార్యులును మదరాసునుండి అనేక గ్రంథములు పంపిరి. ఇట్లంతయు పూనుకొని జరిపిన స్వచ్ఛంద సేవతో ఈ తిక్కన గ్రంథాలయము ఏర్పడి దినదిన ప్రవర్ధమానమై సింహపురీయుల ఆదరాభిమానముల చూరగొనినదై ఈనాడు ఆంధ్రదేశ గ్రంథ భాండాగారముల కన్నిటికిని తలమానికమై వెలయుచున్నది. గ్రంథాలయము చాల పెద్దదై దీనిని పఠనమందిరమునుండి చదువరుల సౌకర్యము కొరకై ప్రత్యేకింపవలసిన అవసరము ఏర్పడ జొచ్చినది.

## ప్రొగ్రెసివ్ యూనియన్ ప్రముఖులు

అధ్యక్షులై అప్రతిమానములును శ్రేయోభివృద్ధికరములును నగు సలహాలతో సంఘమున పోషించినవారును ఆవల నెల్లూరు నందలి అన్ని సంఘములకును అధ్యక్షులుగా వరలి ఎట్టి క్లిష్ట పరిస్థితులయందును సభ ఎంత ఆందోళితమై యున్నను చల్లగా మృదుభాషణముతో తన వశము చేసికొని

నిర్వహించు సామర్థ్య విరాజితుడై యుండి కడపట దేవాదాయ ధర్మాదాయములకు చెంది భగవత్సేవచేసి దిగవంతులైన శ్రీ మైదవోలు చెంగయ్య పంతులు గారిని యూనియన్ మరువజాలదు.

ఉపాధ్యక్షులుగ ప్రప్రథమమునుండి యున్న శ్రీ ఆనంచర్ల సుబ్బు కృష్ణ గారుగారును, కే. వి. వీరరాఘవాచార్యులవారును యూనియన్ విషయమున గలిగియుండిన పక్షపాతమైన అత్యంత అభిమానమును ఎంతేని కొనియాడుకొన వలసియున్నది.

యూనియన్ స్థాపననాటినుండి ఒక ప్రత్యేకమైన భక్తితో యూనియన్‌కు సేవజేసి ప్రప్రథమ కార్యదర్శియు ఆవల ప్రెశిడెంటును నై మూగ నాటకములను ప్రదర్శింప జేయుటలో నొక విశిష్టత నార్జించి తన సొంత సంస్థగా పాటుబడి వృద్ధికి తెచ్చిన శ్రీ మాడభూషి నరశింహాచార్యులవారు స్మరణకు వచ్చుచునేయుందురు.

నాటకముల ఒద్దికలకు కూడ, సొంతముగ తాను వచ్చి అర్ధరాత్రి వేళ వరకు మాతో కలిసి యుండుచుండెడి కార్యదర్శియై, ఎప్పుడును "యూనియన్‌ను ఎట్లు నిజమైన అభివృద్ధి సంఘముగా జేయుదుమా" యనుటయే మనసుగా వర్తిల్లిన శ్రీ రేబాల సుబ్బరాయుడుగారు జ్ఞాపకము వచ్చుచున్నారు.

పై ఉద్ధారకుల కట్టలోని వారై యూనియన్‌లో కం డక్టరుగ నుండి కార్యకర్తృత్వము వహించి ఉపాధ్యక్షులై యూనియన్ విషయమై విశేష సహాయము నొడగూర్చియు కూర్చుచును నుండు శ్రీ తూములూరు శివరామయ్య గారిని గురించి ఎంతేనియు చెప్పికొన తగియున్నది. మరొక చోట ప్రత్యేకించి వ్రాసికొందును.

మిత్రుడు కీ॥ శే॥ మన్నేపల్లి రామకృష్ణరావు తానుండిన సర్కారు నౌకరికి రాజీనామానిచ్చి వచ్చి కలిసి యూనియన్ సేవయే పరమ ముఖ్యముగా సాగింప మొదలుపెట్టి అత్యంతము నాయపడిరి. అహోరాత్రములును అన్ని వేళలను తుదకు ఘోరమైన జబ్బు తన్నావరించి చావు బ్రతుకులలో మునిగినపుడును పిచ్చిగీతలైన అక్షరములతో ఈ యూనియన్ గురించియే తనకుచింతయని జాబును వ్రాసియుంచినవాడుపిదప యెట్లో యూనియన్ అదృష్ట వశమున బ్రతికిఆఖరు నిముసము వరకును సేవచేసిన ఈయనను ఎచ్చటతేగలము? యూనియన్ సేవకులుగ, సహాయ కార్యదర్శులుగను, భాండారీకులుగను, కార్యనిర్వాహకులుగను, కార్యదర్శులుగను అన్ని విధములుగ జంటగా యూనియన్ సేవయే పరమావధిగ పనిచేసిన మా యిరువురిని చూచినపుడెల్ల మిత్రులు యూనియన్ ఊతకర్ర లని వేడుక చేసెడివారు. మా జంట చాల సేవచేసినదనియే గర్వించి చెప్పుకొనుటకు ఈ నాటికి నేను మిగిలియున్నాను.

ముత్తరాజు శ్రీనివాసరావుగారు (వకీలు) తన తీరిక నంతయు యూనియన్ సేవకై వినియోగించుచు ప్రత్యేకము సభ్యులను కలిసికొని చందాల బాకీలు జ్ఞాపక పరచుచు శ్రమించి సేవచేసిన కార్యదర్శి తన సేవకు గల ఏకైక సంస్థగా దీని నెంచి పాటుపడిన ముఖ్యుడు.

కార్యదర్శియై భక్తిగలిగి సేవించి చిరుత వయసున దివంగతుడై యూనియన్‌కు నష్టము గలిగించిన సేవాధురీణుడు, దివ్యవిగ్రహము, మూగ నాటకములయందు నాయక పాత్రను ధరించుచుండిన మిత్రుడు ముత్తరాజు శివకామయ్యను మరల ఎట్లు చూడగలము? రూపపటమును కానరు.

మన్మథరూపుడు అత్యుదార సిగర్వ శిరోమణి ఆ రేబాల పట్టాభిరామిరెడ్డి అధ్యక్షుడుగా శ్రేష్ఠగోని, అనేక గ్రంథములను తమ తలిదండ్రుల పేర ఇచ్చి, తన అంత్యదశ యందును యూనియన్‌ను జ్ఞాపకముంచుకొని ఒక దివ్య భవనమును, ప్రత్యేకించి పఠనమందిరమునకుగా కట్టి ఇచ్చు ఏర్పాటును చేసి, తన సతీమణి శ్రీ సుజాతమ్మగారిచే ఆ పనిని పూర్తిగావించుచు ఊర్ధ్వలోకము నుండి చూచుచుండు మహాశయుని యూనియన్ సేవను ఎంతని కొనియాడగలము! శ్రీ సుజాతమ్మ గారికిని ప్రజోపయోగ ధర్మ కార్యములందు వినియోగించుటకై ఐశ్వర్యాభివృద్ధి దైవము ప్రసాదించుగాక.

ఏకైక దీక్షతో యూనియన్ సేవను చేయుచు ఎవరి వలన ఎట్టి లాభము కలుగవలయునో అట్టి దానిని సంస్థకు చేకూర్చుచు సారస్వత ప్రీతి యెక్కువగా కలిగి ఉపన్యాస ముల నిప్పించుచు అనేకవత్సరములుగ కార్యదర్శిగ నుండుచు ఈనాడును కార్యదర్శియై యుండు శ్రీ గుఱ్ఱం సుబ్బరామయ్య గారును, అధ్యక్షుడై శ్రద్ధ వహించి భక్తి నెరపు శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారును శ్రీమన్నారాయణుని మంగళాశాసన ములకు పాత్రులగుదురుగాక. శ్రీ రెడ్డిగారు కోఆపరేటివ్ బ్యాంకి మున్సిపాలిటీ ఇత్యాదిప్రజాసేవ సంస్థలందు ప్రవేశము కలిగించుకొని అధ్యక్షులుగ నుండియు ఉన్నారు.

ఎం. ఏ., పట్టము నందినవాడై దివ్యమైన ఉపన్యాస ముల యూనియన్‌లో ఇచ్చుచుండి బందరుకు ఉద్యోగరీత్యా చేరి నాటక రచయితయై స్థానం నరసింహారావు. కపిలవాయి రామనాథశాస్త్రి ఇత్యాదులందరు తమ పేరు ముందుకు వచ్చునట్లు చేసికొననిచ్చి నాటక ప్రపంచమునకు అత్యంత సేవజేసి జ్ఞానోదయ సమాజమున ఉపాధ్యక్షుడై యుండి యూనియన్ ప్రథమ సభ్యులలో నొకడై యుండి దివంగతు డైన మా ముత్తరాజు సుబ్బరావు స్మరణ పావనముగదా? ఉత్తరాంధ్ర జిల్లాలవారు సామాన్యముగా నెల్లూరి యందు సవతి ప్రేమగలవారు. విధిలేక నాటక ప్రాశస్త్యమున వీరి

శ్రీకృష్ణ తులాభారమును ప్రదర్శించుకొని ఆనందింపవలసిన వారినిగా చేసిన మహా సముద్రుడు.

కీ॥ శే॥ పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు కావలిలో నెల్లూరు జిల్లా కాన్ఫరెన్సును మేమందరు పోయియుండినపుడు అక్కడికి వచ్చియుండి ఆ మా సభలో యూనియన్ సభ్యులుగా పరిఖాస్తు వ్రాసియిచ్చిరి. అద్భుతముగా పాట పాడు వారు. వీరు పిమ్మట మాకు యావజ్జీవ సభ్యులుగా నుండిరి. వీరు అల్లూరులో కొందరు మిత్రులను చేర్చికొని నాటకప్రదర్శనములను చేయించుచుండి అందుముఖ్యముగా రామదాసు చరిత్ర నాటకమున కబీర్ పాత్రను ధరించి తాను బహుశ్రావ్యముగా పాడి చూడవచ్చిన జనమును ఆనందమున నోలలాడించుచు నుండియున్నారు. ఆ పాత్ర వీరి సొత్తు. పిమ్మట ఆంధ్ర దేశమంతటను ఆ వేషధారణముచేసి మరి టి. రాఘవాచార్యులు ఇత్యాదులతో కలిసి నటించి గొప్ప గౌరవమును నెల్లూరుకు ఆర్జించినవారు. వీరియొద్ద శిష్యుడుగా శ్రీనవలూరు సుబ్రహ్మణ్యం (టంకురోడ్డుగా కనబడుతుంటాడు) చాల నాటకములలో శ్రద్ధవహించి పనిచేయుచుండెడివాడు. వీరికి పిమ్మట ఘంటసాల రాధాకృష్ణయ్య కబీరుగ వర్ధిల్లినవారు.

## వే. వేం. శాస్త్రిలవారు-ప్రొగ్రెసివ్ యూనియన్

ఈ గ్రంథమున పేజి 1కె to 18 లో చెప్పబడిన సంద

ర్భములలో శ్రీశాస్త్రిలవారికిలఅమెట్యూర్ సభవారివిషయమై క్రోధమును సాధనయు ఏర్పడి అది యూనియన్ పైనను తగ్గకనే యుండి, తుదకు యూనియన్ వారి పందిరి తగులబడినప్పుడును అనేక ఊరడింపు తంతి జాబులు వచ్చుచుండగా వీరు ఈ యూని వారయ్యు ఒక సానుభూతి మాంట నేనియు చెప్ప సహింపకుండిరి. వారి నాటకముల మరల యూనియన్ వారు ప్రదర్శింప నెంచి ప్రయత్నపడి శ్రీ శివరామయ్యగారు వారికి అనుమతికై వ్రాయుగా ఉదారమైన వర్తనము చూపక క్రొత్త సభ్యులని ప్రాత సభ్యులని ఏమో పెట్టి తుదకు "బద్దిక లు చక్కగా కుదిరినవి" అని తమ సర్టిఫికేటు లేక ప్రదర్శింప రాదనిరి. యూనియన్ అధ్యక్ష కార్యదర్శులు "ఔదార్యమే శాస్త్రిలవారి యందు మృగ్యమై యున్నద"ని విరమించిరి. శాస్త్రిగారి వర్తనము యూనియన్ విషయమున ఎట్లుండినను యూనియన్ వారు వారిని ఆహ్వానించి, గౌరవించి గౌరవ సభ్యులనుగా చేసికొని "ఆంధ్ర మల్లినాథ" బిరుదమును వారికి మహాసభలో ప్రసాదించి స్నేహ మార్యాదలను సూచించిరి. పిమ్మట వారికినిసొంత కష్టములు కొన్ని ఎదుర్కొన జొచ్చినవి. యూనియన్ వారు వారి కష్టములను విచారించుటకు ధర్మబద్ధులై కార్యదర్శి శ్రీ రేబాల సుబ్బరాయుడుగారు ఈ శాస్త్రిలవారి శిష్యులైన శ్రీ శారదా పీఠ స్వామివారికి వ్రాయుట మొదలుగాగల పనులు జరిగి అంతలో 1921 అహ

మ్రదాబాద్ కాంగ్రెసువద్ద శ్రీ చతుర్వేదుల రాఘవయ్య మేమంతా పోయియుండగా అచ్చట శ్రీ స్వామివారు మమ్మ లను కలిసి శ్రీ శాస్త్రిలవారి కష్ట దశ నెరింగి ఎట్టకేలకు శ్రీ శారదా పీఠము నుండి వీరికి అనేక బిరుద ప్రదానములును, మాసమాసము రు 150/-లు వరుమానము వచ్చునట్లు ఏర్పా ట్లును జరిగి, ఇచ్చట గొప్ప మహాసభలో మర్యాదలు అన్ని పూర్తి అయినవి. ఆవల శ్రీ శారదా పీఠ స్వాములవారు తమ గురువుగారిని స్వహస్తములతో గౌరవింపవలె.నని తమ పీఠము నద్దకు పిలిపించుకొనుటయై వీరు ఆ ప్రయాణము ఏహువి చేసిగో ఆ స్వామివారి ఆ మాసమాస వరుమానమును కోలుపోయినవారైరి. అది మొదలు శ్రీ శివరామయ్యగారు సంవత్సరమునకు రు 100 లు వారికి ఇచ్చుచుండియున్నారు. ఇంకను శ్రీ వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రి ప్రభృతులు సాయ పడుచుండిరి. అంతలో ప్రోగ్రెసివ్ యూనియన్ సభ్యులైన శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు ఋణ విముక్తులనుగా శాస్త్రిలవారిని చేయవూనుకొని ద్రవ్యమును వసూళ్ళు చేయ సాగిరి. శ్రీ శాస్త్రిలవారి శిష్యులలో అగ్రగణ్యులుగా ఎంచ తగిన శ్రీ దొడ్ల వెంకటరామరెడ్డి (కావలి) గారు ఇత్యాదు లందరి సహకారముతో ఇది నెరవేరినది. శాస్త్రిలవారికిని మనశ్శాంతి కలిగినది.

## శ్రీ శాస్త్రి గ్రంథాలయము.

యూనియన్ వారు మహా పండితులగు శ్రీ శాస్త్రుల వారు నెల్లూరు వారగుటకు గర్వించి వారి స్మారకముగా తిక్కన పేరట వెలసే ఒక గ్రంథాలయమును (సంస్కృత గ్రంథములతో) నెలకొల్ప తీర్మానించుకొని వర్షా వర్షమువారి వర్ధంతిని కూడ జరుపుచుండ నిశ్చయించిరి. 1932 సం॥రం డిసంబరు తే 17 ది ఈ గ్రంథాలయము స్థాపింపబడినది. విరాళముగ 47 గ్రంథములును, కొనినవి 125 ను. తిక్కన పుస్తక భాండాగారమునుండి (బొత్తె పెట్టె లాగికొనినవి) 593 గ్రంథములును, శాస్త్రి గ్రంథాలయమునకు చేర్చినట్లు ఆ 1932 సంవత్సరపు రిపోర్టువలన తెలియుగలదు. తిక్కన పేరటి స్మారకము ఏ 1911 సం॥రం మార్చి తే 31 ది (సంవత్సరాదినాడు) ఏర్పడి యున్నది. శ్రీ శాస్త్రులవారు అనగ గనే తిక్కనయందలి వారికిగల పూజ్యత చేత తమ గ్రంథములనన్నింటిని సోమయాజిగారి స్మారకమునకిచ్చిన వారై పిమ్మట "తిక్కన విజయము"ను వ్రాసి కూడ భక్తి నెరపి చిరస్మరణీయులైరి. శ్రీ శాస్త్రిగారు "నాట్యాభిమానము భాషాభిమానమును దిగమింగినది" యని యొకచోట చెప్పినట్లు ఈ శాస్త్రి శిష్యకార్యదర్శుల గురుభక్తి, తిక్కన సోమయాజిగారిని పోటు పొడిచినదైనది. సంస్కృత గ్రంథములను తనయదుంచు కొనుటకు తిక్కన పుస్తక భాండాగారమునకు

అనర్వాతి ఎట్లు ఏర్పడినదో ఎఱుగను. శ్రీ శాస్త్రులవారా మాట యెన్నడును ఎక్కడను చెప్పియుండలేదే, వీరికిట్లు తోచినదో? వారియాత్మ సంక్షోభించి గదా యుండును? ఇట్లు జరుపుట కళంకముకదా! ఇది శాస్త్రిగారి ఆత్మకు శాంతి యోయగునా? గ్రంథముల నొసగినవారు ఏ స్మారకమునకై వాని నొసంగిరో అదిగదా ముఖ్యము. వారి మనసులను మార్చుటకు మన కధికారము మా? 1932 సం॥రం రిపోర్టులో కార్య నిర్వాహకుల తీర్మానములన్నియు అచ్చొత్తింబడి యున్నవి. అందు తిక్కన గ్రంథాలయమునుండి గ్రంథములను పెకలించి వేసి స్మారకమున నుంచవలె ఎక్కడను కానదే! శ్రీ శాస్త్రి గారి పేర గ్రంథాలయ ముంచుట మాత్రమే యున్నది. అది సంస్కృత గ్రంథాలయముగా వర్తింప దలంచిరి. సంస్కృత గ్రంథాలయమున తెనుగు లేకను, తెనుగు గ్రంథాలయమున సంస్కృత ముండకూడదనియు కలదా! "ధరలోన స్నిజమాడ నిష్ఠురముగదా– సామెతల్ తప్పునే" అని శ్రీశాస్త్రులవారే అనిరుద్ధుని నోట చెప్పించినారు. యూనియన్ విషయమున వైరుధ్యము చూపుచుండిన ఆంధ్ర భాషాభిమాని సమాజము వారై మంచి నటులై "శంఖచూడుడు" ఇత్యాది పాత్రముల ధరించి చక్కగా నిర్వహించిన వారైన శ్రీ ఓరుగంటి వెంకట కృష్ణయ్యగారు యూనియన్ కార్యదర్శులై శ్రీ కుట్టం సుబ్బ రామయ్యగారితో కలిసి పనిచేయుచుండిన కాలమిది. తీర్మా

నములు, రిపోర్టులు అన్ని ఎన్నడో శ్రీ వంగోలు వెంకట రంగయ్యగారు అమెట్యూర్ నాటక సభలోనే కోరి జరుగ కుండిన దానిని వీరు పట్టుబట్టి తెలుగునకు మార్చినారు. అది ఎంతయు సంతసింప తగినది.

ఆంధ్ర భాషాభిమాని సమాజమును తమలో కలిపి కొనిన గుర్తు ఆంధ్ర సభవారు ఏమిచేసి యున్నారో తెలియ లేదు. సమాజాధ్యక్షులైన శాస్త్రిగారి పేర గ్రంథాలయ మును న్యాయతః వారుగదా పూనుకొని యుండవలెను! అది అక్కడను జరుగలేదు. శాస్త్రులవారు "ఆంధ్ర భాషాభిమాని సమాజము' అని యొక చిన్ని గ్రంథమును తమ సభ్యులకై ఒక ప్పుడు వెలువరించియుండి అందు "నన్నయ" గ్రంథ భాండా గారమును నిర్మింపు మనిరి. శిష్యులు దానికి పూనుకొనుట వారి ఆత్మశాంతిగా అనుకొనరైరి.

## శ్రీ తూములూరు శివరామయ్య పంతులుగారు

వీరు గ్రంథము నందంతటను ప్రస్తావమునకు వచ్చియే యున్నారు. ప్రొగ్రెసివ్ యూనియన్ ప్రథమ వర్గపు పెద్దల లోని వారు. యూనియన్ వారి "పండిన పెరటి కల్పకము" నెల్లూరు టవున్ అభివృద్ధికై పాటుపడు అర్హతగల సంస్థ యూనియనే యను అభిప్రాయమువారు. చిట్టిచిట్టి సంఘము లకు, వానికి తగిన పనులనే సలహా ఇచ్చుచుందురు, యూని యన్ నెల్లూరున ఒక అద్వితీయమై విఖ్యాతిగనిన గొప్ప

సంస్థయె శాశ్వతత్వకన్నది అనువారు. ట్రంకురోడ్డుకు ఇరుప్రక్క-
ల నీడనిచ్చు చెట్లునాటు ప్రయత్నము చేయవలసినదిగా సలహా
నిచ్చినపుడును, పిమ్మట శ్రీ వే. వేం శాస్త్రులవారిని యూని
యన్ వారు సన్మానించి నూట పదార్లొసగి ఆంధ్ర మల్లినాథ
బిరుద ప్రదానమును వారికి చేసినపుడును, వీరు తమ సొంత
ద్రవ్యమును యూనియన్‌దిగా వాడుకొననిచ్చి భరించినవారు.
యూనియన్ పార్లమెంటొకటి నెలకొల్పగా అందు స్పీకర్‌గ
నుండి చర్చలను సక్రమ పద్ధతుల సమర్థతతో జరిపించినవారు
యూనియన్ "పఠన మండలి" (Reading circle) నెల
కొల్పించి పాటుపడినవారు. యూనియన్‌వారేర్పరచు మహా
సభలకు సర్వసాధారణముగా అధ్యక్షతను వహించి వెలి
యూరివారై వచ్చిన ఉపన్యాసకులగు ఘనులకు నెల్లూరు ఏ
మాత్రము తీసిపోవునది కాదని యనిపించి పంపెడి సామర్థ్య
విరాజితులు. యూనియన్ గౌరవ సభ్యులై యుండి తిక్కన
జయంత్యుత్సవము యొక్క శాశ్వత జరుగుపాటునకు వలయు
సన్నివేశములు, తద్వంశజులగు పాటూరి వారితో మాటలాడి
ఏర్పాటుచేసి జరిపించుచుండువారు. తమ మిత్రులైన శ్రీ
తిక్కవరపు రామిరెడ్డిగారు (యూనియన్ ఉపాధ్యక్షులు) వారి
తండ్రిగారి పేర వర్షావర్షము పండిత కవి సన్మానముగ నూట
పదార్లు యుక్తమగువారి కొసగుచుండునట్లు ప్రోత్సహించి
జరుప జేసినవారు. తద్వ్యయ శాశ్వత భరణమునకు శ్రీ రెడ్డి

గారును సంకల్పించి జరుపుచున్నారు. యూనియన్ వారు పం
తులవారికి కృతజ్ఞతా బద్ధులై యుండియున్నారు. వీరి యూని
యన్ సేవ అపారము. నెల్లూరున అడిగిన వారికి తోచిన సన్మాన
దానముల నొనర్చుటయందు అద్వితీయుడను ఖ్యాతి వీరికి
గలదు. అడిగి లేదనుపించుకొనిన వాడరుదు. వీరు ఏతత్కళా
పోషణమున నిధి. ఔచిత్యమును గుర్తెరింగి నటులకు బోధిం
చుట వీరి ప్రతిభావిశేషము. స్వకము నాటక ప్రదర్శనముల
యందత్యంతాసక్తిగొని పాటుబడువారు. నాట్యకళా పరిషత్తు
నకు అధ్యక్షులైనవారు. వీరి అధ్యక్షకోపన్యాసము అద్వితీయ
మైనదై అపూర్వ విషయములను బోధించినది. శ్రీ వే. వేం.
శాస్త్రిలవారి యందు పక్షపాతమైన భక్తి నెరపువారు. నాటక
ముల పునరుద్ధరణ సంఘమువారికి అమూల్యములైన విషయ
ముల నుపన్యసించి, అప్రతిమానమైన సాక్ష్యము రికార్డు చేసిన
వారు. అతి దీర్ఘములగుట చే రస భంగము ఏర్పడి, రంగమున
రక్తికట్టని నాటకముల తోడుగు తగ్గించి, రసపోషణ యేర్పడు
నట్లు దిద్దితీర్చి ప్రదర్శింపించుటలో ప్రత్యేకమైన యొక సమర్థ
తను ఆర్జించినవారు. వీరి ఆదరాభిమానములు ఇందువిషయమై
ఎవరికిని ఎంతేనియు గలదు. ధార్మికుడు. తన్ను సమీపించు
టకు ఎవ్వరికిని జంకు నొడగూర్పని అందుపాటులో నుండు
వారు. సరస సల్లాప ప్రియుడు. మూలప్పేట యంగ్ మెన్సు
ఆసోసియేషనున ఒకప్పుడు ఇంగ్లీషు నాటకమున పాత్రధారియై

తంగమున నిలుచుట ఎఱుంగుదురు. యూనియన్ వారు "మృచ్ఛకటిక"మును ఆడ పూన్చి అందు "శ్రేష్ఠికాయస్థుడు" అను ఒక చిన్న పాత్రను రంగమున నిలుచుటకు తమ కాక్షే పణ లేదనుటకు సూచకముగ గ్రహించి ఒద్దికల తామే జరుపుచుండియున్నారు. కారణాంతరమున ఆ నాటకము ప్రదర్శింపబడ లేదు.

శ్రీ పులిగండ్ల వెంకటకృష్ణయ్యగారు వీరు ఆంధ్ర సభ యొక్క బహిఃప్రాణము. ప్రొగ్రెసివ్ యూనియన్ సభ్యులు, ఔదార్య సంపన్నులు. సారస్వత పోషణము నెడ పక్షపాత బుద్ధి కలవారు. అందు విషయమై విరాళముల నొసగుచు ఈవి కీ వారని కీర్తి గాంచుచున్నారు. గర్వము లేనివారు మహా సులభుడై చాల కలియు కలుపు కలిగినవారు. వీరిని ఐశ్వర్యము వరించు చున్నది. కృతిభర్తయైనవారు గవర్న మెంటు ప్లీడరుగ ఇప్పుడున్నారు. శ్రీ కోట శ్రీనివాసరావుగారు (వకీలు) ఆంధ్ర సభా కార్యదర్శి — నాటకములలో ప్రధాన పాత్రధారి. అనాయాసముగ పద్యముల నెన్నింటినేని రంగ మున రమ్యముగ పాడి శ్రవణానందము కలిగించుటలో నిధి. వేషధారణమున రూపమున లోపము యెనరేని చెప్పుదు రేమో కాని పద్య పఠనముచే వారిని యెంతేనియు తనియింప జేసి తృప్తి గొలిపెడివారు. యస్. యస్. కృష్ణమూర్తిగారు వీరు సారస్వతాభినివేశము కలవారు. వీరును మరియొకరును

"త్యాగరాజ" నాటకమును రచించియున్నారు. నటనా కౌశలమును కలవారు. ఈ ప్లీడరుగారు ప్లీడరు గుమాస్తా వేషము వేసి బహు చమత్కారముగ నిర్వహించియున్నారు.

శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు కవి పండితులు, నాటక రచయిత, మంచి కంఠము. వేష ధారణమును చేయువారు. సరసకవి. సాహిత్యరత్నము. శ్రీ వేగూరు వెంకటప్పగారు. నక్షత్రకుడై హరిశ్చంద్రుని బాధలు పెట్టినప్పుడును, పిదప పశ్చాత్తప్తుడై యు బాగా నటించినవాడు. చిల్లర వేషము లందు సమర్థత చూపువాడు. శ్రీ కామరాజుగడ్డ శ్రీనివాసరావు చిన్ననాటి ప్రహ్లాదుడు. బాగా పాడగలిగినవాడు. సామాన్యముగ అన్ని నాటకములలో ప్రధానపాత్ర ధరించువాడు. సమర్థుడు. తన లోపములను ఒప్పిగొని నేర్చుకొనుటయందు ఆర్తిగల నిగర్వి. పెద్దల యెడ భక్తి నెఱపువాడు. దుష్యంత పాత్రను ఇంకను యెక్కువ ఔచిత్యంతో ప్రదర్శింపు నాశగొనినవాడు. గుణవంతుడు. వీరి మిత్రుడు నాయికా వేషధారి శుద్ధముగా పాడువాడు శ్రీ చెన్నూరి శేషగిరిరావుగారు, కొళంద వేలు వేడుకకాడు. అసల్ చాకల పేరిగాడు. సదా సంతోషి-నిపుణుడు. మృత్యుంజయం, వెంకటరెడ్డి, ఫ్రెండ్స్ యూనియన్ ఒడయడు శ్రీ తూములూరి పరమశివం ఎన్నతగినవారు. ఇంక ఒంగోలు పద్మరాజు, యస్. రామదాసు ఇత్యాదులు కలరు సరస్వతి అమెట్యూర్స్

"సోరాబ్ రుస్తుం" ఇత్యాది నాటకముల నాడియుండి, నిలిచి పోయినది. శ్రీ పిల్లవేణు శంకరయ్య (పంచాయత్ ఆఫీసు) ఇత్యాదులు ఇందు వేషధారణము చేయుచుండిరి.

నెల్లూరు వారైన ప్రఖ్యాత సినిమా డైరెక్టరులు:- శ్రీ వై. వి. రావుగారు, పుల్లయ్యగారు, ఘంటసాల బలరామయ్య గారు, కీ॥ శే॥ దువ్వూరు రామిరెడ్డిగారు స్మరణీయులు. నెల్లూరు పౌరవరుడై షెక్స్పియర్ నాటకములలో ప్రపంచ ఖ్యాతి నందిన నటుడై లండను నగరమునను నటించి కీర్తి నార్జించి అలరారిన కీ॥ శే॥ బడి చెంగారెడ్డి గారును మరువతగనివారు. మరి ఈనాడు, ఈ కళోపాసన యందే మనసు నిలిపి తత్పోషణకై బహుముఖముల ప్రయత్నించుచు దేశసంచారియైవిఖ్యాతికి వచ్చియుండు శ్రీ వైద్యుల చంద్రశేఖరంగారు, ప్రతియొక రిని దేశనాయకులను అనుకరించి వేషధారణము చేసి అసలు వారు దిగివచ్చినట్లే తోపజేయుచు అనన్యసామాన్య సామర్థ్య విరాజితుడై యున్నారు. వీరిని నెల్లూరు మరువజాలదు. నాటకములందు వేషధారణము చేయకున్నను తత్కళాపోషణమున శ్రద్ధవహించి ఎక్కువగా శ్రీ ఆంధ్రసభకై పక్షపాతముతో సహాయము చేయుచు ఈనాడు "గీతామందిరము"ను ఒక దానిని ఆంధ్రసభా భవన ఉపరిభాగమున మూడు వేల రూప్యములతో నిర్మించి యిచ్చుటకు సంసిద్ధులైయుండు శ్రీ చతుర్వేదుల రామచంద్రయ్యగారు మరువ తగినవారుకారు.

వీరికి ప్రొగ్రెసివ్ యూనియన్ నందును కొంత అభిమాన ముంటచే అచ్చట జరుగు శ్రీ శాస్త్రి వర్ధంతినాడు వర్షావర్షము తమ అన్నగారు కీ॥ శే॥ చతుర్వేదుల శ్రీరాములుగారిస్మారకముగా ఒక రజిత పతకమును సంస్కృత కళాశాలలో పరీక్షలో ఉత్తీర్ణులైన విద్యార్థికి ఇచ్చుచున్నారు. ఇదిశాశ్వతముగా జరుగతగు పద్ధతికి వలయు మూలధనము నొసంగెదరని వినికిడి. ఇంకను ఎంతయేనియు వ్రాయతగినది యున్నది.

వకీలు శ్రీ ముంగమూరు నరసింహారావుగారును, ఆకారసదృశమైన గాంభీర్య ప్రజ్ఞ గలిగి నటించువారు. స్త్రీ పాత్రధారి శ్రీ అనంతభొట్ల ఆదిశేషయ్యగారును, "తుఫాను" లో ప్రఖ్యాతి జెందిన శ్రీగాడేపల్లి రామయ్య ఇత్యాదులు ఎందరో యున్నారు. కొందరి పేర్లు ఇందులో చేరక విడిపోయి యుండిన అవి ఉద్దేశ పూర్వకముగా వగలినవి కావని నన్ను చదువరులు మన్నింపగలరని నమ్ముచున్నాను. ప్రొగ్రెసివ్ యూనియన్ను స్థాపించిన నాటి ప్రథమ ప్రెసిడెంట్ వెంకట్రామయ్యర్ వద్ద నుండినవాడై అప్పుడు కొంత జంకుతో చేరకున్నను పిమ్మట అందు సభ్యుడై, ఉపాధ్యక్షుడునై యుండి శ్రీ మాలెకొండయ్య గారు ఈనాడు ఆంధ్ర సభకు అధ్యక్షులై యున్నారు.

## నెల్లూరి ప్రత్యేకత

ఆంధ్ర దేశమున నెల్లూరు మధ్య దేశము. ఇచ్చట పద్య పఠనము, ఇచ్చటి నటనా కౌశలము, ఔచిత్య పోష

ణము ఇట్టివి ఆంధ్ర దేశము నందలి ఇతర ప్రాంతముల కాన నచ్చుట అరుదు. ఉత్తరాంధ్రుల ఆ తొందర మాట, యాస, పద్యము పాడు మోటార్ కారు స్పీడు, ఇవి ఈ దేశమున నవ్వు పుట్టించును. శ్రీ స్థానం నరసింహారావుగారిని గొప్ప నటుడుగా నెల్లూరు గ్రహించిన గుర్తుగా వారికి తమ యింట శ్రీ దొర స్వామి అయ్యంగారువారు కొంత స్నేహ బృందముతో కొద్ది పాటి విందును జరిపి ఆదరించియున్నవారు. గుణము ఎచ్చట నుండినను గ్రహించువారు నెల్లూరు వారు. ఇక నెల్లూరు వారైన నటులు ఉత్తర జిల్లాలలో ప్రఖ్యాతులగుట ఆశ్చర్య మేమున్నది? ఇచ్చట ఎంత తగ్గుపాటి నటు డనిపించుకొనిన వాడును ఆ ప్రాంత్యములకు ఉత్తమ నటుడై యలరారును. ముఖ్యము ఔచిత్యము. పద్యము పాడుట ఎట్టి సమయముల ఎంత మాత్రము నడకలో నుండవలయునో, ఒకే పద్యమున భావ ప్రకటనము రెండు మూడు విధముల మారవలసివచ్చి నపుడు ఒకే రోకటి పాటగా పాడుటయం దర్థమేమున్నదని గ్రహించి నటింపవలయుననుట నెల్లూరు బోధించును. ఉత్తరాంధ్ర ప్రఖ్యాత నటుడైన కీ॥ శే॥ ఎడవల్లి సూర్యనారాయణ గారి దుష్యంత పాత్ర స్మరణకు వచ్చుచున్నది. వారి "హా యేనయ్యో" పాట ఆ చిందులు త్రొక్కి పాడడము ఇత్యాదులు ఎంతేని ఔచిత్య భంగమని నెల్లూరు నందలి ప్రతిచిన్నవాడును అసమ్మతినిచూపినవాడె. తప్పు చెప్పక నాట్యకళాభి వృద్ధిని కోరు సదభిప్రాయముననే నిజము చెప్పుచున్నాను.

ఇవ్విధమున నెల్లూరు నాటక కళ ప్రవర్ధమానమైనది. ఇప్పుడుండు నాటక సమాజముల వారును మున్ముందు ఏర్పడ బోవువారును ఇందలి విషయముల గ్రహించి తమ తమ సంస్థలను చక్కనైన క్రమ శిక్షణలో జరుపుకొనుచు వానిని తమ తమ సొంతములుగా ప్రతి సభ్యుడును భావించి, కళా పోషణమును చేయుచు, ఆచంద్రార్క స్థాయిగా ఈ దివ్య కళకు ఒక అలంకారముగా నెల్లూరు ప్రత్యేకతను కూర్చు సమాజ మై లక్షణ్యముతో జరుపుకొందురుగాక యని ఆశించు చున్నాను.

## ఒక అద్భుత విశేషము

ఇది మాతాత్సంభవము. ఆంధ్ర సభ వారు ఈనాడు (14-4-52) ఒక మహా సభను కూర్చి శ్రీ శివరామయ్యగారి రూప పటావిష్కరణమును శ్రీ ప్రకాశం పంతులుగారిని ఆహ్వానించి వారిచే జరిపించి యున్నారు. శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు వచ్చి అధ్యక్షత వహించిరి. ఇది ఎంతయు నొప్పును. శ్రీ శివరామయ్యగారి రూప పటమును శ్రీ వంకా లక్ష్మీనారాయణయ్యగారు తమ సొంత ఖర్చుతో వ్రాయించి తెచ్చి సమర్పించి అవిష్కరణమునకై ఆంధ్రసభ వారిని నిక్కచ్చి యొనర్చుట కారణముగా ఇంత కాలమునకు ఈకార్యనిర్వహణమును ఆంధ్ర సభవారు జరిపించియున్నారు ఎట్లో జరుగ తగినది, జరుగవలసినది జరిగినది. సభ మిక్కిలి

జయప్రదమైనది. శ్రీ ప్రకాశము పంతులుగారు ఆవిష్కరణ మొనర్చ ననుగ్రహించి వచ్చుటయే శ్రీ శివరామయ్యగారి గౌరవమును ఎంతేనియు కొనియాడును. మహాసభయందు శ్రీ శివరామయ్యగారి గుణ ప్రశంస మెప్పుగ ఒప్పుగ జరిగినది. టౌన్ హాలున క్రిక్కిరిసి వెలిప్రక్కల నంతయు నిండి యుబికి నిక్కినిక్కి చూచుచుండిన ఆ శేష జనము అమందానందభరితులైరి. సరసకవి శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు- పద్యములను సొంపు గులుక రచించి బహు రమ్యముగా తామే వేదికపై పఠించి శ్రీ శివరామయ్యగారికి సమర్పించిరి. వాని నిందు ప్రచురించుచున్నాను.

14—4—52

హరిసర్వోత్తముఁడే సభాధిపతి - ధీరాగ్రేసరుం డాంధ్రకే
సరి యావిష్కృతికర్త — కూడిన సభాస్తారుల్ గుణజ్ఞుల్ — వశం
తరమా రంజిత నంద నాబ్ద మిది - సందర్శించె సొంపుల్ పరం
పరగా మా శివరామయార్య ప్రతిబింబశ్రీ సమావిష్కృతిన్. 1

ప్రతిభావంతుఁడుగా సుచారుఁడుగ విద్వత్కల్పవృక్షమ్ముగా
నుతికెక్కెన్ బురియందు మండలమునందున్ - న్యాయవాదిత్వమం
దతులప్రజ్ఞ కలట్టివాఁడని సమస్తాంధ్రావనిన్ గట్టి కీ
ర్తి నార్జించెను - దూముకూరికుల వర్ధిష్ణుండు సాహస్యుఁడే! 2

ఈ మాన్యుండు కళాభిమాని - కవితన్ నృత్యమ్ము సంగీతమున్
ప్రేమం బెంచినవాఁడు - నాటకకళావృద్ధిన్ మదింగోరియు
ద్దామోత్సాహముతోడ నాంధ్రసభ సంస్థాపించె, నేతత్సభా
ప్రాముఖ్యమ్మున కీమహామహుని యారంభంబె మూలంబగున్

నటసభఁ గూర్చి, గాయకగణమ్ముల పోషకుఁడై, కృతీశుఁడై,
పటుతర వాగ్విభూతి కలవాడయి పౌర వతంసుఁ డయ్యె, వి
స్ఫుట మతి యీ మహోదయుఁడు; భూషణ మౌచు దదీయరూపపుం
బటము నిజంబు సింహ "పురమందిర" సుందర చిత్రశాలకున్ 4

ప్రకృతము-తూములూరి శివరామ మనీషి శుభాకృతిన్ విధా
యకముగ నస్మదీయ మగు నాంధ్రసభా భవనంబునందు ని
ల్పఁగొనెడు సంవిధానము శివుండు లభింపఁగఁ జేసెమాకు నే
డకలుషుఁ డాంధ్ర కేసరి దయామతియై యరుదెంచె దీనికై 5

తన దేశమాతృ "స్వతంత్రయజ్ఞము"న ఆస్తుల నెల్ల వేల్చిన సోమయాజి
షైరిఫితంగికి వక్షఃస్థలముఁ జూపి నిలిచి గెల్చిన గండు తెలుఁగుజోదు
స్వపద చ్యుతికి సుంత సరకుసేయక ఆర్జవము నోముకొనెడు దేవవ్రతుండు,
పదవిఁ గోల్పడినను ప్రభలో నొకింతేని కొటువోని స్వయంప్రకాశమూర్తి
ఆంధ్రకేసరి—శివరామయార్య రూపపటము నావిష్కరింపంగ వచ్చెనన్న
భాగధేయ మపూర్వ మీ వాసి సింహనగరిదో యాంధ్రసభదో
యెన్నంగవశమె! 6

హరిహరనాథ సార కరుణామృత వృష్టికిఁ బాత్రుఁడై, కవీ
శ్వరుల యమోఘ వాక్కులఁ బ్రవర్తిలు దీవెన లందుకొంచు నే
డ్తెఱ శివరామయార్యుఁడు ప్రతిష్ఠ గడించి యనూన దీప్తితో
హరిపురపౌర హారమణియై సుచిరాయువుగా వెలుంగుతన్. 7

ఇట్లు,

నెల్లూరు "సాహిత్య రత్న"

## ముగింపు

ఎటుజూచినను ఏ సంస్థయందును నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియను వారే అయియుండిరి. కీ॥ శే॥ ముత్తరాజు సుబ్బ

రావు వంటి నాటక రచయితలయినను, శాసన సభా సభ్యులైన కీ॥ శే॥ ఆమంచర్ల కృష్ణరావు పంతులుగారును, శాసన సభాధ్యక్షులైడె యీనాడు పార్లమెంటు సభ్యులైన శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారును కాంగ్రెసు మంత్రివర్గములోనినాటక పునరుద్ధరణ ప్రియుడును, రవీంద్రుని నాటికలను బహు చక్కగా ఆంధ్రీకరించినవారును నగు శ్రీ బెజవాడ గోపాల రెడ్డిగారును, వీరందరు ప్రోగ్రెసివ్ యూనియన్ వారై యుండిరి నాటక సమాజముల కన్నింటికి ఇందు లీనమై యుండు ఆమెట్యూర్ నాటక సభయే తల్లి సంస్థయై యున్నది. నాటక సమాజములలో హెచ్చు తక్కువల అభిప్రాయములు ప్రవేశించినట్లయిన అదియే దానికి ముప్పనియు, గడించిన ద్రవ్యము సత్కార్యములకు వినియోగించుటయే ధర్మమనియు ఆ సభ నుండి తెలియతగినదని చదువరులు గ్రహింపనగును.

ఇప్పటికిని నెల్లూరున ఈ కళాపోషణమునందు అభిమానులును, నటనా కౌశలము కలిగిన పాత్రధారులును లేక పోలేదు. ఒక విధమైన వ్యష్టిత్వము ఆపాదించి తమతమ సంఘములందు ఆభిజాత్యము పెనగొనియున్నది. నాట్యకళాభినయమును ఏకీకరణముచేసి తల్లి సంస్థ యగు నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియను నందు కేంద్రీకరించిన, నెల్లూరునకు ప్రతిమాన ఖ్యాతి కలుగగలదు. ఇందు విషయమై శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారును, యూనియన్ అధ్యక్షులుగా నుండు శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారును, ప్రముఖులైె నెల్లూరు విషయములందు శ్రద్ధ వహించిన మాననీయులు శ్రీ బెజవాడ రామ

చంద్రారెడ్డిగారును, సారస్వత పోషకులుగనుండు శ్రీ తిక్క వరపు రామిరెడ్డిగారును వెంటనే పూనుకొని అన్ని సంఘముల వారిని చేర్చి సంప్రతించి ప్రొగ్రెసివ్ యూనియన్ ఏర్పడిన నాటి సమైక్యతాకీర్తిని మరల నటబృంద సంఘమునకు గడించి పిచ్చి పిచ్చి నాటకములుగాక యుక్తములగు వానిని ప్రజల ఆనందామోదములకు పాత్రమైనవానిని ప్రదర్శింపచేయుటగా నిర్ణయించి ఏర్పరచుట ముఖ్య కర్తవ్యముగా గ్రహింతురని సలహానిచ్చుచు ఆశించుచున్నాము. శ్రీ శివరామయ్యగారును ఇప్పటికిని ఆ కళాపోషణమున ఆర్తి గొనినవారగుట వారును తమ సహాయమును ఇందు విషయమై సంపూర్ణముగ నొసగ గలరని నమ్ముచున్నాము. కేవలము పామరజన రంజకములై నీతి భంజకములగు సోషల్ నాటక ప్రదర్శనముల విడనాడి శ్రీ రాజేంద్రప్రసాద్‌గారు (రిపబ్లిక్ అధ్యక్షులు) "నాకే పూర్తి అధికారమున్నచో బాలబాలికల భావి నీతి వర్తనము నకు భంగకరముగ దుష్ప్రచార దుర్బోధనల చేయు ఈ సినిమా ప్రదర్శనముల హాతమార్చియుందును" అని వాపోయి యుంటను గౌరవించి నటించుదురుగాక! యనియు ఈసినిమా ప్రపంచమున కొట్టుకొనిపోక నిలువబడి నెల్లూరు నూతన వికాశముతో పునః వెలుగొంది ఆంధ్ర దేశమునకు మార్గ దర్శకమై తన కీర్తిని వెల్లడించుగాక యనియు ఆశించుచు ఇంతట విరమించుచున్నాను.

సంపూర్ణము.

## కాఫీ త్రాగుడు మానండి

జనమును వశము చేసికొని బాధపెట్టునట్టి యెట్టి త్రాగుడునుగాని, మానివేయవలెనని గాంధీమహాత్ముని ఆదేశము. కల్లు సారాయిలతో పాటు కాఫీ, టీ, కోకోలు సహాచేరినవే. వీటిని వాడుక చేసినవారు వీటినుండి బుద్ధి మరల్పలేని దాసులై యున్నారు. పల్లెటూళ్లలో సద్ది అన్నము భోజనము జేయుచుండిన వారందరు పట్టణ వాసములకు వచ్చి ఇతరులను చూచి కాఫీ హోటళ్ల వాతబడి, తమ గ్రామములో, తమ కొంపలలో కాఫీపిశాచాన్ని ప్రవేశపెట్టుకొన్నారు, ఇంతకన్న ఆపదకలదా? వైద్యశాస్త్రజ్ఞులందరు అన్ని మతములవారు కాఫీ త్రాగుడు చాలచెడ్డదని దృఢముగా చెప్పుచున్నారు. ఇండ్లలో స్త్రీలు ఈపిశాచముచే అధిష్టింపబడి పురుషులను తేగలవారిని తేలేని వారిని ఒకేవిధముగా "అన్నము లేకున్నను మానె ఇదిలేక బ్రతుక"మని నిక్కచ్చి యొనర్చి బాధించుట, చెప్పుకొనుటకు సిగ్గయినను అందరికి తెలిసిన విషయము. కాబట్టి దయచేసి దీనిని మానండి. ఉదయముననే తేటమజ్జిగ త్రాగండి. మిక్కిలి ఆరోగ్యమని ఇంగ్లీషు డాక్టరులే చెప్పెదురు. విద్యార్థులు ముందు ముందు దేశ సౌభాగ్యమును నిలుపుకొనవలసిన వారు కాఫీహోటళ్ల వాతబడి డబ్బు ఖాళీచేసికొని వళ్లుగుల్ల చేసికొనకుండ ఆయుర్వృద్ధి చేసికొనుటకై దయచేసి కాఫీమానండి.

---

